CHAITANYAMANAVI
R.NO.APBIL/2019/78298

# చైతన్య మానవి

ట్రాన్స్ జండర్స్ ప్రత్యేక సంచిక

VOL : 2 ISSUE : 4 GUNTUR, APRIL,MAY,JUNE,2020 56 PAGES RS.20/-

## రక్తంతో తడుస్తున్న రహదారులు
## పురిటి బిడ్డను పొత్తిళ్లలో పెట్టుకొని
## రోడ్డున పడిన వలస బతుకులు





HKZE

# సహాయ కార్యక్రమాలు



విజయవాడ



గుంటూరు



తూర్పుగోదావరి, అమలాపురం



విశాఖ రూరల్



కర్నూలు



తిరుపతి



నెల్లూరు



ఒంగోలు

సంపాదకీయం

# ఇదీ భారతం!

ఢిల్లీలో ఒక వలస కార్మికుడు సెల్‌ఫోనును రూ. 2,500కు అమ్ముకుని, ఆ సొమ్మును భార్యకిచ్చి తాను ఆత్మహత్య చేసుకున్నాడు. చత్తీస్‌గఢ్‌కు చెందిన పన్నెండేళ్ల బాలిక 'జమాలో' తెలంగాణ నుంచి కాలినడకన బయలుదేరి తిండీతిప్పలు లేక ఊరి పొలిమేరల్లో కూలబడి పోయింది. ఔరంగాబాద్ జిల్లాలో 17 మంది కూలీలు నిద్రలోనే గూడ్స్ రైలు కింద నలిగిపోయారు. ఎర్రటి ఎండల్లో, ఆకలి మంటలతో, చెప్పులే లేని కాళ్లతో, నెత్తిన మూటలతో, చంకల్లో పసిబిడ్డలతో దారి మధ్యలో ప్రాణాలు కోల్పోతున్న వారిని వదిలేస్తూ, దుఖాఃన్ని పంటి బిగువున ఆపుకుంటూ ఈ దేశ రహదారులపై వలస కార్మికులు నిరంతరాయంగా దీర్ఘ పాదయాత్రలు చేస్తున్నారు. ఈ గాథలూ, బాధలూ పాలకులకు పట్టలేదు. మీడియా కూడా అంతే. కరోనా బాధితుల కంటే వందల రెట్లు వలస కూలీలు బాధితులయ్యారు. ఆకలి, నీరసం, మాడ్చి మసిచేసే ఎండలు, ప్రమాదాలు, ఆత్మహత్యలు లెక్కవేస్తే కరోనా మరణాలకు తక్కువవుండవేమో!

వలస కార్మికుల గురించి కేంద్రం ఎందుకు ఆలోచించలేదు? మార్చి 23న జనతా కర్ఫ్యూ పెట్టే నాటికే వలస కూలీల లెక్కలు కొన్నైనా ఉన్నాయి కదా! మధ్యప్రదేశ్‌లో ప్రభుత్వ ఏర్పాటు కోసం ఫిరాయింపుల ప్రణాళికను సజావుగా అమలుచేసుకున్న తదుపరి 25 నుంచి లాక్‌డౌన్ ప్రకటించిన ప్రధానికి వలస కూలీల ప్రయాణానికి ఎందుకు ఏర్పాటు చేయలేదు? మూడో విడత లాక్‌డౌన్ సడలింపుల్లో మద్యం దుకాణాలకు అనుమతించిన బీజేపీ ప్రభుత్వం వలస కూలీల ప్రయాణాలను ఎందుకు ఆమోదించలేదు. ప్రతి ఒక్క వలస కూలీని ఇంటికి చేరుస్తామన్న ఆత్మనిర్భరత్వాన్ని ఎందుకు ప్రకటించలేదు.

దొరికిన వాహనం మీద సొంత ఊరు వెళ్లడానికి ప్రయత్నించిన వలస కార్మికులను అడ్డుకోవాలని ఆదేశించారంటే ఈ ప్రభుత్వం కనీస బాధ్యతతో పనిచేసిందా? అని ప్రశ్నించక తప్పదు. జాతీయరహదారులపై కూలీలను అడ్డుకోవడంతో వలస కూలీలు అడ్డదారుల్లోనూ, రైలుపట్టాల పైనా నడవాల్సిన దుర్గతి ఈ దేశ ప్రజలకు పట్టించిన ఈ ప్రభుత్వానికి సరిపోయే శిక్ష ఏమిటి?

2011 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో 37శాతం, అంటే 45 కోట్ల మంది పనికోసం వలసలు వెళ్లే వారున్నారు. రోడ్డు పక్క డాబాల నుంచి ఇటుక బట్టీల వరకూ నాగరికతనూ, అభివృద్ధినీ తీర్చిదిద్దే ఏ పనీ వలస కూలీలు లేకుండా సాగదు! వారు లేకుండా అభివృద్ధి లేదు. జీడీపీ అసలే లేదు!!

సొంతూరిలో పనులు దొరకని దుస్థితి ఒకవైపు, యజమానుల లాభాపేక్ష మరో వైపు కలగలిసి వలస కూలీలు ఇబ్బడి ముబ్బడిగా పెరిగారు. పుట్టిపెరిగిన నేలమీద పనిదొరక్క బతుకుతెరువు కోసం పరాయి భూభాగంలో కన్నీటితో కడుపు నింపుకున్నారు. నింబంధనలతో పనిలేకుండా వెట్టి చేసే శ్రమ జీవులు వీరు. రోజుకు 12 గంటల పని, అరకొరగా వేతనాలు ఇంతకంటే యజమానులకు కావల్సింది ఏముంది? ప్రమాదం జరిగి చనిపోయినా అడిగే వారుండరు. ఆందోళనలు ఉండవు!!

వలస కూలీల్లో అత్యధికులు ఎస్సీ, ఎస్టీ, వెనుకబడిన తరగతులు వారు ఉండటం ఈ దేశ సామాజిక పీడన తీరుకు అద్దం పడుతోంది. అందులో మహిళలు కూడా! మాతృత్వం అంటూ గొప్పలు పలికేవారికి కాన్పు అయ్యి వందల కిలో మీటర్లు నడవాల్సి వచ్చిన పచ్చి బాలింతలు, గర్భిణులు మాతృమూర్తులుగా కన్పించలేదు. లాక్‌డౌన్‌తో కాంట్రాక్టర్లు ముఖం చాటేశారు. దీంతో కూలీలు రోడ్ల మీదకు చేరాల్సి వచ్చింది. ఒక స్వచ్ఛంద సంస్థ సర్వే ప్రకారం లాక్‌డౌన్ సమయానికి 50 శాతం వలస కూలీల చేతుల్లో కేవలం ఒక్క రోజుకు సరిపడా సరుకులు మాత్రమే టఉన్నాయి. చేతిలో రూ. 100 కూడా లేని వలస కూలీలు 90 శాతం మంది దాకా ఉన్నారు.

ప్రజలు, స్వచ్ఛంద సంస్థలు, వామపక్షాలు చేసిన సహాయంతో ఆకలి తీర్చుకుంటూ వలస కూలీలు నడక మొదలెట్టారు. విదేశాల్లో ఉన్న వారిని విమానాల్లో తీసుకొచ్చిన ప్రభుత్వాలకు దేశంలో కూలీల గోడు పట్టలేదు. పైగా చేతిలో కొద్దిపాటి డబ్బుతో వాహనాల్లో ప్రయాణమైన వారిని, చిల్లి గవ్వలేక కాలనడక ప్రారంభించిన కోట్లాది కార్మికులను రహదారుల్లో అడ్డగించి లాఠీ ఛార్జీలకు పూనుకున్నారు. ప్రజలలో పెల్లుబికిన ఆగ్రహం, ఆందోళనల కారణంగా ఎట్టకేలకు ఏర్పాటు చేసిన శ్రామిక రైళ్లలో ఛార్జీలు పెట్టుకుని వెళ్లాలన్న ఆదేశాలు ఈ ప్రభుత్వ ప్రజా వ్యతిరేక స్వభావాన్ని బట్టబయలు చేశాయి. ఒక్క కేరళ ప్రభుత్వమే వలస కూలీలకు ఆహారాన్నీ, వసతినీ కల్పించటమే కాకుండా, వారి ఇళ్లకు అద్దెలు, విద్యుత్తు బిల్లులు కూడా చెల్లించి కూలీల ప్రభుత్వమన్న నానుడిని సొంతం చేసుకుంది. 21,556 శిబిరాలు ఏర్పాటు చేసింది. కానీ పక్కనే ఉన్న కర్నాటకలో బీజేపీ ప్రభుత్వం అమానుషంగా వ్యవహరించింది. శ్రామిక రైళ్లను తమ రాష్ట్రంలో తిరక్కుండా ఆపుచేయించింది.

7.7 కోట్ల టన్నుల ఆహార నిల్వలు మన దేశ గిడ్డంగుల్లో మూల్గుతున్నాయి. కానీ రేషన్ కార్డు లేనివారికి ఇంత వరకు గింజ సహాయం లేదు. ఈ ధాన్యాన్ని శానిటైజర్ల తయారీకి అనుమతించింది విశాల ఛాతి ఉన్న మోడీ ప్రభుత్వం.

సర్వోన్నత ధర్మాసనం కూడా పాలకుల కోసమేనని రుజువు చేసుకుంది. నడిచి వెళ్లేవాళ్లను పట్టించుకోవటం సాధ్యం కాదన్నట్లుగా వ్యాఖ్యానించింది.

దేశ నిర్మాణానికి రాళ్లెత్తిన కర్మ వీరులకు దయాదాక్షిణ్యాలు కాదు కావాల్సింది. బాధ్యత నెరవేర్చే ప్రభుత్వాలు, పని హక్కును గ్యారంటీ చేసే వ్యవస్థలు కావాలి. బతుకు కోసం చాకిరీ చేయటమే కాదు! ఆ చాకిరికి న్యాయమైన ఫలితాన్ని అందివ్వాలి. రోడ్డెక్కితేనే పట్టించుకునే ప్రభుత్వాలు కాదు. కార్మికుల సంక్షేమం, కష్టజీవులైన రైతు కూలీల సంక్షేమం లక్ష్యంగా పనిచేసే పాలన కావాలి. వలస కూలీల వెతలపై స్పందించిన ప్రతి ఒక్కరూ ఒక్కటై ఆలోచించాలి. ఆచరణలో అడుగులు కలపాలి.



కార్టూనిజం




ఆయనేమో...
ఖరీదైన లక్షల కాలేజీలకి సున్నాలు ఎన్నుంటాయో వెతికేస్తున్నారు,
పిల్లలు లాజిక్-మ్యాజిక్ అని కొత్తాట ఆడుతున్నారు
ఇక నేనేమో....




ఆయింటా పగటి కల..!
గంజి సల్లారి పోతుంది...
మింగుదువు గాని... లే...!!
ఎల్లెల్లవారి నీలాంటోళ్లను
వంట ముందిని నిలబెట్టి
కొంటా...!




యావయ్యా మేస్ట్రూ!
'మానవుడు సంఘజీవి' అని
రాస్తే సున్నా మార్కు లేస్తావా?




మీరిద్దరూ '24 గంటలూ' ఫోన్లతో
ఉంటే నాకు బోరు కొట్టదా..చెప్పండి.




నువ్వే ఎక్కడో పెట్టి మరిచిపోయావ్
అలమర తాళం చెవులు, నాకేం తెల్సు!
ఓసారి గూగుల్‌లో సెర్చ్ చెయ్యి!

> మహిళలను అంధకారంలోను, తెర చాటున ఉంచేసి... మీరు మాత్రం ముందుకు నడవాలనుకోవడం వృథా ప్రయాసే. అదెప్పటికీ జరగదు.




**ఐద్వా ఆంధ్రప్రదేశ్ మహిళాసంఘం**

చిరునామా :

ఐద్వా రాష్ట్ర కార్యాలయం,

పి.ఎల్.రావు భవన్, 2/7 బ్రాడీపేట,

గుంటూరు, గుంటూరు జిల్లా - 522002,

ఆంధ్రప్రదేశ్, ఫోన్ : 9490098620

chaitanyamanavi@gmail.com

fb : aidwaap

Blog : aidwaap@blogspot.com





ప్రజాశక్తి ప్రింటర్స్ & పబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్

**పోస్టల్ చందా**

సంవత్సరానికి రూ : 150/-

విడి ప్రతి వెల రూ : 10/-

వ్యాసాలు, లేఖలు పంపించవలసిన చిరునామా :

మారుతీనగర్, ప్రకాశరావు వీధి,

చుట్టు గుంట సెంటర్, విజయవాడ - 4


# చైతన్య మానవి


సంపుటి : 2

సంచిక : 4


## ఈ సంచికలో






PRINTED AND PUBLISEHD BY D. RAMA DEVI, AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM, PRINTED AT PRAJASAKTI PRINTERS & PUBLISHERS PVT. LTD. 14-12-19, PRAKASH NAGAR, KRISHNA NAGAR (P), TADEPALLI (M), GUNTUR DIST.PUBLISHED AT AIDWA ANDHRA PRADESH MAHILA SANGHAM AIDWA STATE OFFICE P.L.RAO BHAVAN, 2/7 BRODIPET, GUNTUR-522002, ANDHRA PRADESH STATE. EDITOR: D. RAMA DEVI. R.NO. APBIL/2019/78298

# కరోనాని నయం చేయవచ్చు... కానీ మతోన్మాదాన్ని..?

భారతదేశంలో రెండు వ్యాధులు కలకలం రేపుతున్నాయి. ఒకటి ప్రపంచ వ్యాప్తంగా అన్ని దేశాల ప్రజలనూ ఆందోళనకు గురిచేస్తూ, శాస్త్రవేత్తలకు, వైద్య సిబ్బందికి ఆందోళన కలిగిస్తున్న కరోనా వైరస్ (కోవిడ్-19) కాగా, మరొకటి తరతరాలుగా అందరికీ తెలిసి, రాజకీయ స్వార్థ ప్రయోజనాల కోసం పెంచి పోషిస్తున్న మతోన్మాదం. కరోనా వైరస్ దేశ వ్యాప్తంగా వేలల్లోనే ప్రాణాలను బలిగొనగా, మతోన్మాదం ఏటా వేలాది మంది ప్రాణాలను బలి తీసుకుంటోంది.




కరోనా వైరస్ వ్యాప్తి చెందుతున్న కొద్దీ ముస్లిం వ్యతిరేక ప్రచారం కూడా జోరందుకుంటోంది. కొన్ని మీడియా సంస్థలు, టెలివిజన్ ఛానళ్లు మైనారిటీలపై విషం చిమ్మడమే పనిగా పెట్టుకున్నాయి. ఢిల్లీ లోని నిజాముద్దీన్ మర్కజ్ మసీదులో మార్చి నెలలో జరిగిన తబ్లిగీ జమాత్ సమావేశం ఒక్కటే దేశమంతా కరోనా వ్యాప్తికి కారణమైనట్టుగా ఇవి చిత్రీకరిస్తున్నాయి. అల్లరి మూక ఒకటి ఢిల్లీలో ఓ ముస్లిముల ఇంటిపై దాడి చేసింది. మరో చోట కిరాణా దుకాణం యజమాని ఒకడు ముస్లిం కుటుంబానికి చెందిన తల్లీకూతుళ్లను నోటికి వచ్చినట్టుగా తిట్టాడు. వుత్తరప్రదేశ్ లోని మహెూబా ప్రాంతంలో తమను తబ్లిగీలుగా పిలుస్తూ, తమ నుంచి కూరగాయలు కొనడానికి నిరాకరిస్తున్నారని ఒక ముస్లిం కుటుంబం ఫిర్యాదు చేసింది. అహ్మదాబాద్‌లోని ఒక ఆసుపత్రి యాజమాన్యం మత ప్రాతిపదికన రోగులను విభజించి, వార్డులు కేటాయిస్తోందని వార్తలు వచ్చాయి. దీని మీద తీవ్ర వ్యతిరేకత వ్యక్తం కావడంతో గుజరాత్ ప్రభుత్వం అటువంటిదేమీ లేదంటూ వివరణ ఇచ్చింది. ముస్లిములు ఉద్దేశపూర్వకంగా వైరస్‌ను వ్యాప్తి చేస్తున్నారని సామాజిక మాధ్యమాల్లో ఫేక్ వీడియోలు, వాట్సప్ సమాచారం చలామణిలోకి వచ్చాయి.

తబ్లిగీ జమాత్ సమావేశం పౌర సమాజ బాధ్యతా రాహిత్యానికి ఓ నిదర్శనం. అయితే ఇటువంటి సమావేశాన్ని కేంద్ర హెూం మంత్రిత్వశాఖ ప్రత్యక్ష పర్యవేక్షణలో ఉండే ఢిల్లీ పోలీస్ శాఖ అనుమతించి వుండకూడదు. ఈ సమావేశానికి హాజరైన వారు ఢిల్లీతో పాటు ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, తెలంగాణ రాష్ట్రాల్లో కొంత మేరకు వైరస్ వ్యాప్తికి కారణమయ్యారు. అంతమాత్రం చేత దేశంలోని అన్ని నగరాలలోనూ, పట్టణాల్లోనూ వైరస్ వ్యాప్తికి వీరే కారణమని చెప్పడం సబబు కాదు. వుదాహరణకు, అత్యంత తీవ్రంగా

**తబ్లిగీ జమాత్ సమావేశం పౌర సమాజ బాధ్యతా రాహిత్యానికి ఓ నిదర్శనం. అయితే ఇటువంటి సమావేశాన్ని కేంద్ర హెూం మంత్రిత్వశాఖ ప్రత్యక్ష పర్యవేక్షణలో ఉండే ఢిల్లీ పోలీస్ శాఖ అనుమతించి వుండకూడదు. ఈ సమావేశానికి హాజరైన వారు ఢిల్లీతో పాటు ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, తెలంగాణ రాష్ట్రాల్లో కొంత మేరకు వైరస్ వ్యాప్తికి కారణమయ్యారు. అంతమాత్రం చేత దేశంలోని అన్ని నగరాలలోనూ, పట్టణాల్లోనూ వైరస్ వ్యాప్తికి వీరే కారణమని చెప్పడం సబబు కాదు.**

ప్రభావితమైన ముంబయి నగరంలో కుల, మత, వర్గాలకు అతీతంగా వైరస్ వ్యాపిస్తోంది. మధ్యతరగతి కుటుంబాలు ఉండే వర్లీ-కొలివాడలోనూ, నిరుపేద ప్రజలుండే ధారావి మురికివాడలోనూ, సంపన్నులు మాత్రమే నివసించే మలబార్ హిల్స్‌లోనూ వ్యాధి తీవ్రత ఒకే మాదిరిగా ఉంది.

నిజానికి, కోవిడ్‌తో జరిపే పోరాటంలో ముందు వరసలో ఉన్న ఆరోగ్య రంగ కార్యకర్తల్లో ముస్లిము మహిళలు పెద్ద సంఖ్యలో ఉన్నారు. ఇండోర్‌లో అల్లరి మూక దాడికి గురైన ఇద్దరు వైద్యులలో ఒకరు ముస్లిమే! కరోనా వైరస్ వ్యాప్తిని అడ్డుకోవడంలో ప్రపంచమంతా ప్రశంసలు పొందుతున్న కేరళలో ముస్లిములు గణనీయ సంఖ్యలోనే వున్నారు. ఇక్కడహిందువులు, ముస్లిములు, క్రిస్టియన్లు కలిసి పనిచేయడం వల్లే నివారణ సాధ్యమవు తోంది. కరోనాపై జరుగుతున్న పోరుకు భారీ మొత్తంలో విరాళం ఇచ్చిన కార్పొరేట్ సంస్థ అధినేత ప్రేమ్‌జీ కూడా ముస్లిమే! కరోనా అంతం కోసం ఔషధ రంగంలో జరుగుతున్న కృషిలో ముందు వరుసన నిలిచిన రెండు ఫార్మా కంపెనీలు సిప్లా, వోకార్డ్ యజమానులు ముస్లిములే! ముంబయిలో దావూదీ, బోహ్రాలు వేలాది మందికి ప్రతిరోజూ భోజనం పెడుతున్నారు. ఇండోర్‌లో హిందూ మహిళ భౌతిక కాయానికి ఇరుగు పొరుగున ఉన్న ముస్లిములు అంత్యక్రియలు నిర్వహించారు.

నిహంగి శాఖకు చెందిన సభ్యుడు ఒకడు పోలీసు చేతిని నరికితే ప్రతి సిక్కునీ బాధ్యునిగా చేయలేదు. గో గూండాలు కొందరు దాడులకూ, హత్యలకూ దిగితే ప్రతి హిందువునీ వేలెత్తి చూపలేదు. కాని దానికి భిన్నంగా వైరస్ వ్యాప్తి విషయంలో ప్రతి ముస్లిమును వేలెత్తి చూపడం ఎంతవరకు సబబు? కర్ణాటకకు చెందిన బీజేపీ శాసనసభ్యుడు ఒకడు వందలాది మంది మధ్య అట్టహాసంగా పుట్టినరోజును జరుపుకున్నాడు. ముంబయిలో ఓ విఐపి కాన్వాయితో సహా పిక్నిక్‌కు వెళ్లాడు. కర్నాటకలోని ఓ గుడిలో జరిగే రథోత్సవం కోసం వేలాది మంది లాక్‌డౌన్ నిబంధనలను ఉల్లంఘించినట్లు వార్తలు వచ్చాయి. మన రాష్ట్రంలో వందలాది మంది గుంపుతో కార్యక్రమాలు నిర్వహించిన ఐదుగురు వైసీపీ శాసనసభ్యులకు రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం తాఖీదులు జారీ చేసింది. వీటన్నింటినీ పరిశీలించినప్పుడు అర్థమయ్యేది ఏమిటంటే వైరస్ వ్యాప్తికి మతం కారణం కాదనీ, ఏ మాత్రం బాధ్యత లేని కొందరు కారణమని అర్థమవుతోంది.

దేశంలో అంటరానితనం వైరస్ ఎప్పటి నుంచో ఉంది. మత విద్వేషం కూడా దీనికి తోడవడంతో కరోనా వైరస్ రాకకు ముందే పరిస్థితి తీవ్రంగా ఉంది. ప్రజలు మతం, కులం పేరుతో చీలిపోయి, భౌతిక దూరం పాటిస్తున్నారు. కొన్ని సంవత్సరాలుగా ప్రభుత్వాలు కూడా పౌరసత్వ అర్హతల సవరణ పేరుతో బహిరంగంగానే వివక్షను ప్రదర్శిస్తున్నాయి. ముస్లిములను అపనమ్మకంతో చూడటం, ప్రభుత్వ వైద్యులు కూడా వైద్య సేవలు నిరాకరించడం వంటి సంఘటనలు చోటుచేసుకున్నాయి. దీంతో దేశవ్యాప్తంగా ముస్లిములు అభద్రతలో చిక్కుకున్నారు.

ఈ విద్వేష వైరస్ అత్యంత వేగంగా వ్యాపించే అంటువ్యాధి. ముస్లిములను కరోనా వైరస్‌ను తీసుకువచ్చిన శత్రువుల్లా ఒకవైపు చూస్తున్నారు - మరోవైపు అనుమానం, విద్వేషాలతో దాడులకు దిగుతున్నారు. కరోనా కట్టడికి కృషి చేస్తున్న వైద్య బృందాల్లో ఉన్న వైద్యుల మొదలు గ్రామాల్లో నివసించే సాధారణ ముస్లిములు కూడా ఈ దాడుల్లో లక్ష్యంగా మారుతున్నారు. వలస కార్మికుల్లో ఉండే ముస్లిములను సొంత ఊళ్లకు రానీయకుండా అడ్డుకుంటున్నారు.

కరోనా వైరస్ నివారణ కోసం వ్యాక్సిన్ తయారు చేయడానికి శాస్త్రవేత్తలు కృషి చేస్తున్నారు. అయితే, ఈ మత విద్వేష వైరస్‌కు మందును ఎవరు తయారు చేస్తారు? మనం మనలోకి ప్రయాణం చేయాలి. అంతర్ముఖంగా సాగే ఆ ప్రయాణంలో మానవత్వం కోసం వెదకాలి. మనిషిని మనిషిగా చూపే సమానత్వం కోసం గాలించాలి. నిజానికి, హిందూ, ఇస్లాంతో పాటు అన్ని మతాలు చెప్పిన సారం ఇదే! సరిహద్దులు లేకుండా ప్రపంచాన్నంతా గడగడలాడిస్తున్న మహమ్మారి విజృంభించిన సమయంలో కూడా మతోన్మాదాన్ని తుద ముట్టించక పోతే.. ఇంకెప్పుడు ఆ పని చేయగలం?

**('టైమ్స్ ఆఫ్ ఇండియా' సౌజన్యం)**

✷

# కరోనా కష్ట కాలంలోనూ మద్యం అమ్మకాలు అత్యవసరమా?

కరోనా వైరస్‌తో సోకుతోన్న కోవిడ్ – 19 ప్రాణాంతక వ్యాధి కారణంగా 2020 మార్చి 24 నుంచి కేంద్ర ప్రభుత్వం దేశమంతటా లాక్‌డౌన్ ప్రకటించింది. మే నాలుగో తేదీ నుంచి మూడో విడత లాక్‌డౌన్ అమలులోకి వచ్చింది. సచ్ఛీలత గురించి ఆత్మ నిర్భరత గురించి ప్రబోధించే ప్రధాని మోడీ మద్యం దుకాణాలు తెరిచేందుకు అనుమతి ఇచ్చి లిక్కర్ మాఫియాను లాభాల అందలం ఎక్కించారు. యాభై రోజుల పాటు మద్యానికి దూరంగా ఉన్న వ్యసన పరులు మద్యం దుకాణాల ముందు బారులు తీరి కరోనాకు ఘన స్వాగతం పలికారు.

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీమాన్ జగన్మోహన్ రెడ్డి ఎన్నికలకు ముందు అక్కాచెల్లెమ్మలకు దశల వారీ మద్య నిషేధం అంటూ ఓ రత్నాన్ని బహుకరించారు. లాక్‌డౌన్‌తో మద్యం దుకాణాలు మూత పడ్డాయి. మహిళలు ప్రశాంతంగా ఊపిరి పీల్చుకున్నారు. మద్య నిషేదం అమలు చేయడానికీ ఓ రత్నంలాంటి అవకాశం రాష్ట్ర ప్రభుత్వానికి వచ్చింది. కానీ ఆ అవకాశాన్ని కాలదన్నేసి పక్కనున్న రాష్ట్రాల కంటే ముందే ఇక్కడ మద్యం దుకాణాలను తెరిచారు. ఇదేమిటన్నా అంటూ ఆక్రోశించిన అక్కాచెల్లెమ్మలను శాంత పరిచేందుకు తొలుత 50 శాతం,ఆ తరువాత 75 శాతం దాకా మద్యం ధరలు పెంచారు. మరో 13 శాతం మద్యం షాపులు తగ్గిస్తానన్నారు. రెండవ దశలో 20 శాతం షాపులు తగ్గిస్తానని ఇచ్చిన హామీని కూడా అమలు చేసే సాహసం కూడా చేయలేకపోయారు.

పలమనేరు మండలంలో ఓ తల్లీకూతుళ్ల ఆత్మహత్యతో మద్యం దుకాణాలను ప్రారంభించారు. మే 11వ తేదీ రాష్ట్రంలో మహిళా, విద్యార్థి, యువజన, కార్మిక తదితర సంఘాల పిలుపు మేరకు ఐదు వందల ప్రాంతాలలో పన్నెండు వేల మందితో మద్యం దుకాణాలను మూయండి! పని చూపండి!



తిండి పెట్టడంటూ! వీధుల్లోకి వచ్చారు. మందు తాగి వచ్చి కొట్టడం తిరిగి మొదలైంది. సంక్షేమ చర్యలు అందుకున్న సంతృప్తి మద్యం దకాణాల ప్రారంభంతో ఆవిరయింది.

కరోనా కష్టకాలంలో పని కల్పించే చర్యలకు బదులు మద్యం దుకాణాలకు అనుమతి ఇవ్వడంలో ఆంతర్యం ఏమిటి? జనాభాలో రెండో స్థానంలోనూ, విశాల మయిన మార్కెట్లు కలిగివున్న భారతదేశం విదేశీ, స్వదేశీ లిక్కర్ వ్యాపారులకు ఓ ఆకర్షణ. భారతదేశ జనాభాలో అప్పుడప్పుడూ తాగే వాళ్ళతో సహా లెక్కిస్తే 36 శాతం ప్రజలకు మాత్రమే తాగుడు అలవాటు వుంది. ఎంత ఎక్కువ మందికి అలవాటు చేయగలిగితే అంతగా మార్కెట్ విస్తరిస్తుంది. మద్యం దుకాణాలు తెరిచేందుకుగాను లిక్కర్ కంపెనీల యజమానులు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను ఒప్పించగలిగాయి. తెర వెనుక ప్రయత్నాలు జరగలేదని చెప్పలేము.

కేరళలో లాక్‌డౌన్ సమయంలో మద్యం దుకాణాలను తెరవబోమని ఆ రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. మద్య నిషేధం ప్రకటించిన జగన్మోహనరెడ్డి ప్రభుత్వం కనీసం లాక్‌డౌన్ కాలం ముగిసే వరకూ కూడా ఆగలేక పోయింది. ఈ వైఖరి ఆయన వాగ్దానాన్ని ప్రశ్నార్థకం చేసింది.

మద్యం అలవాటు ఒక జబ్బు. ఒక వ్యసనం. కరోనాలాగే ఇది కూడా ఒకరి నుంచి మరొకరికి అంటుకుంటుంది. మద్యం తాగినప్పుడు విడుదలయ్యే డోపమిన్ అనే రసాయనం విడుదలతో తాగిన వ్యక్తికి ఆ నిషా దిగే వరకూ ఆనందం కలిగిస్తుంది. ధైర్యం తెప్పిస్తుంది. మనసులో ఉన్న అసంతృప్తిని అసహజ ప్రవృత్తిని ప్రేరేపిస్తుంది. విచక్షణ మరచి క్రూరంగా వ్యవహరించటం వంటి లక్షణాలతో బహుముఖంగా ప్రభావితం చేస్తుంది. ప్రజల బలహీనతలతో సొమ్ము చేసుకునే వ్యాపారులు, ఆదాయాన్ని పొందేందుకుగాను ప్రభుత్వాలు, తప్పుడు పనులు చేయించే పెద్దమనుషులు, అనుచరులను తయారు చేసుకునేందుకూ, ప్రజలను మత్తులో వుంచేందుకూ రాజకీయ నాయకులు తాగుడును పెంచి పోషిస్తున్నారు.

మద్యం అందుబాటులో లేకపోతే పలువురు తాగుడు జోలికి పోరని రాష్ట్ర అనుభవం. చాటుమాటుగానూ, అనుమతులతోనూ వీధి వీధికీ మద్యం సరఫరా చేసే యత్నం ఈ వ్యవస్థది. అందువలన వ్యసనాన్ని మాన్పించి మద్య నియంత్రణను సాధించడం అనేది సంక్లిష్ట ప్రక్రియ. అయితే అసాధ్యం కాదు. కానీ దొంగ సారాను, మద్యం దుకాణాలనూ అరి కట్టకుండా మద్య నియంత్రణ సాధ్యం కాదు. అందుకోసం కఠిన

**మద్యం అలవాటు ఒక జబ్బు, ఒక వ్యసనం, కరోనాలాగే ఇది కూడా ఒకరి నుంచి మరొకరికి అంటుకుంటుంది. మద్యం తాగినప్పుడు విడుదలయ్యే డోపమిన్ అనే రసాయనం విడుదలతో తాగిన వ్యక్తికి ఆ నిషా దిగే వరకూ ఆనందం కలిగిస్తుంది. ధైర్యం తెస్తుంది. మనసులో ఉన్న అసంతృప్తిని, అసహజ ప్రవృత్తిని ప్రేరేపిస్తుంది. విచక్షణ మరచి క్రూరంగా వ్యవహరించటం వంటి లక్షణాలతో బహుముఖంగా ప్రభావితం చేస్తుంది. ప్రజల బలహీనతలతో సొమ్ము చేసుకునే వ్యాపారులు, ఆదాయాన్ని పొందేందుకుగాను ప్రభుత్వాలు, తప్పుడు పనులు చేయించే పెద్దమనుషులు, అనుచరులను తయారు చేసుకునేందుకు రాజకీయ నాయకులు తాగుడును పెంచి పోషిస్తున్నారు.**

చట్టాలు మాత్రమే కాదు, ప్రజా చైతన్యాన్ని పెంచి, వారిని భాగస్వాములను చేయాలి. ఈ పనులను చిత్తశుద్ధితో నిర్వర్తించాలి. తాగుడు వ్యసనానికి గురైనవారికి కౌన్సెలింగ్, వైద్యం అందించాలి. మద్యం అమ్మడాన్నీ, తాగడాన్నీ నిషేధిస్తూ డ్రై డేస్ (మద్యం లేని రోజులను) ప్రకటించాలి. తాగి నేరాలకు పాల్పడే వారికి కఠిన శిక్షలు అమలు చేయాలి. తాగినప్పుడు చేసే నేరాలను తక్కువ చేసే నేర సెక్షన్లను మార్చాలి. తాగే అలవాటున్న కుటుంబాల ఆర్థిక, సామాజిక పరిస్థితులపై క్రమబద్ధంగా సర్వే చేయించాలి. ఆ కుటుంబాలలో హింసకు అవకాశం లేకుండా నిరంతర చర్యలు చేపట్టాలి. మహిళలకు, పిల్లలకు అవసరమైన రక్షణ చర్యలు తీసుకోవాలి. సమాజం, కుటుంబం, ప్రభుత్వం సమన్వయంతో మద్య వ్యసనానికి బానిసలుగా మారే దురవస్థ నుంచి ఒక నూతన సంస్కృతిని అలవరచుకోవచ్చు.

రాష్ట్రంలో సారా ఉద్యమానికీ, బీహార్లో సారా నిషేధానికి చారిత్రక కారణాలున్నాయి. మద్యం ద్వారా ఆదాయాన్ని ఇబ్బడిముబ్బడిగా పెంచుకునే ఆయా రాష్ట్ర ప్రభుత్వ వ్యూహాల వలన ప్రజలు భరించలేని స్థితికి చేరారు. ఫలితంగా వుద్యమాలు ఉవ్వెత్తున సాగాయి. మద్య విధానం రాజకీయ అంశంగా వెలుగులోకి వచ్చింది.

రాష్ట్రంలో 1992 – 93 సంవత్సరాలలో సాగిన సారా ఉద్యమానికి 'వారుణీ వాహిని ' పథకంతో ఊరూరా మద్యం అమ్మకాలు పెంచడం, రేషన్ బియ్యం రేటు పెరగడం, జమిలిగా కారణమయ్యాయి. బీహార్లో 2005లో నితీష్ కుమార్ ప్రభుత్వం ఎక్సైజ్ విధానాన్ని సరళీకరించినందున ఆ రాష్ట్ర ప్రభుత్వానికి రూ. 500 కోట్ల ఆదాయం రూ. 4000 కోట్లకు చేరింది. ఫలితంగా 2016లో మహిళలు ఉద్యమించి షాపులు బందు చేయించారు. దానితో ప్రభుత్వం నుంచి నిషేధ వాగ్దానం వచ్చింది. చంద్రబాబు ప్రభుత్వ కాలంలో అధికారులకు టార్గెట్లు పెట్టారు. ప్రభుత్వ ఆదాయం పెరగడం లక్ష్యంగా, మద్యం దుకాణాలను పెంచుకుంటూ పోవడం వలన మహిళల ఆగ్రహానికి కారణమయింది. జాతీయ రహదారులలో 500 మీటర్లు లోపు మద్యం దుకాణాలు వద్దన్న సర్వోన్నత న్యాయస్థానం తీర్పును నీరుగార్చారు. గ్రామాల్లో వద్దంటున్నా దుకాణాలను ఏర్పాటు చేశారు. 1918 జులై – ఆగస్టులో మహిళల ఉద్యమాల కారణంగా టిడిపి ప్రభుత్వం మహిళలు వద్దన్న చోట దుకాణాలను మూసివేస్తామని ప్రకటించింది. ఆ ఉద్యమాల వల్లనే ప్రధాన ప్రతిపక్షంగా ఉన్న వైయస్సార్సీపీ మద్యనిషేధం చేవడతామని హామీ ప్రకటించింది.

ఉద్యమాలు చల్లారక అసలు రూపాలు బయటపడతాయి. ఇప్పుడు రాష్ట్ర ముఖ్యమంత్రి దారి ఎటో తేలాలి? మద్యం అలవాటును మాన్పించడానికి ధరలు పెంచుతున్నామన్న వాదన పసలేనిది. సిగరెట్ల వాడకం రేట్లు పెంచినందు వలన కాక దాని వలన జరిగే నష్టం గురించి సాగుతున్న ప్రచారం వలనే వాడకం తగ్గిందనేది వివిధ రిపోర్టులు స్పష్టం చేస్తున్నాయి. నిషేధం గురించి మాట్లాడే జగన్మోహనరెడ్డి ప్రభుత్వం ఈ సంవత్సరం కాలంలో ప్రచారానికి కనీసంగా నిధులు కేటాయించలేదు.

ప్రభుత్వానికి ఆదాయమెట్లా అంటూ కొందరు చర్చ సాగిస్తున్నారు. మద్య నిషేధ సమయంలో ఆంధ్రప్రదేశ్‌లో గానీ, నేడు బీహార్‌లో గానీ, బట్టలు, వాహనాలు, ఆహార పదార్థాల మరియు వస్తువుల కొనుగోళ్లతో ఖజానా భర్తీకి తోడ్పడినట్లు నివేదికలు వున్నాయి. అంతేకాదు మద్య నియంత్రణ వలన కుటుంబాలకూ, సమాజానికీ ఒనగూరే లాభాలు ఎక్కువే. విద్య, ఆరోగ్యం. మహిళా సాధికారత వంటి అనేక లక్ష్యాల సాధన వేగవంతం అవుతుంది. పక్క రాష్ట్రాలలో అమ్ముతుంటే హద్దులు దాటి అక్రమ మద్యం వచ్చేస్తుందనే కథలు వినిపిస్తుంటారు. రాజకీయ నాయకులు, అధికారుల మీద చర్యలు తీసుకోగలిగే దమ్ము ఉంటే పక్క రాష్ట్రాలు మాత్రమే కాదు మన రాష్ట్రంలో అక్రమ సారా ఉత్పత్తి కేంద్రాలు కూడా సాగవు.

ఈ చర్యలతో పాటు తాగే వయసును సవరించాలి. వెనకటి సమాజాల లో ప్రత్యేక సందర్భాలలోనే సురాపానం ఉండేది. ఇప్పటికీ కొన్ని ఆదివాసీ ప్రాంతాలలో పెద్దల ముందు పిల్లలు తాగకపోవడం అనే ఆచారం సాగుతుంది. మంచి అలవాట్ల గురించీ, ఆరోగ్య కరమైన జీవితం గురించీ ఆశించేవారు మద్య నియంత్రణ గురించి తీవ్రంగా ఆలోచించాలి. మద్యం తాగే వ్యసనాన్ని తగ్గించేందుకు అన్ని ప్రయత్నాలూ చేయాలి. ప్రభుత్వ విధానాలను ప్రభావితం చేసే విధంగా ఆయా తరగతుల హక్కుల కోసం, మెరుగైన జీవితం కోసం పోరాడే సంఘాలూ, సంస్థలూ, వ్యక్తులూ కలిసి కట్టుగా కార్యాచరణకు పూనుకోవాలి.

బలమైన లిక్కర్ మాఫియా, పాలక వర్గాల ప్రయోజనాలు కలిసి మద్యం, గంజాయి, గుట్కా పాన్ పరాగ్ లాంటి దురలవాట్లకు ప్రజలను బానిసలను చేస్తున్నాయి. ఈ ప్రమాదాన్ని నిలువరించి కాస్తంత శాంతిని పొందేందుకు ఉన్నత జీవన ప్రమాణాలను సాధించుకునేందుకు, ఉద్యమమే మార్గం..!

*

పి. అరుణ

# కరోనా పరీక్షలలోనూ వివక్షతే

## కరోనా వైరస్ స్త్రీ పురుషులలో సమానంగా వ్యాప్తి



కరోనా వ్యాధి సోకినవారిలో భారతదేశంలో 76 శాతం, పాకిస్తాన్లో 72శాతం పురుషులే. కోవేడ్ - 19 వ్యాధిగ్రస్తులు భారత, పాకిస్తాన్లలో మాత్రమే 70 శాతం పైబడి పురుషులు ఉన్నారు. మిగిలిన అన్ని దేశాలలో మహిళల, పురుషుల నిష్పత్తిలో స్వల్ప తేడాలు మాత్రమే నమోదయ్యాయి.

ప్రపంచ గణాంకాల విశ్లేషణ ప్రకారం అనేక ఇతర దేశాలకు భిన్నంగా కోవిడ్-19 పరీక్షల నిష్పత్తి భారతదేశంలో సమతుల్యంగా లేదు. పురుషులలో ఈ పరీక్షలు అత్యధికంగా జరిగాయి. రోగ నిర్ధారణ పరీక్షలు అవసరమైన మేరకు స్త్రీలలో జరగలేదని ఈ గణాంకాలు తెలియ జేస్తున్నాయి. దేశంలో రోగ నిర్ధారణ అయినవారిలో 76 శాతం పురుషులని ఆరోగ్య మంత్రిత్వ శాఖ ఏప్రిల్ ఆరున ప్రకటించింది. ఆ రోజుకి నిర్ధారించిన మొత్తం కేసుల సంఖ్య 4,506.

ఇంగ్లాండ్, అమెరికాతో సహా అనేక ప్రపంచ దేశాలు ప్రకటించిన వ్యాధిగ్రస్తుల మరణాల సంఖ్య లింగ పరంగా విభజించ లేదు. అయినప్పటికీ స్వతంత్ర పరిశోధక సంస్థ గ్లోబల్ హెల్త్ ఆధ్వర్యంలో 40 దేశాలు ప్రకటించిన గణాంకాలపై విశ్లేషణ జరిగింది. ఈ సంస్థ లింగపరమైన ఆరోగ్య అంశాలపై పరిశోధనలు జరుపుతోంది. భారతదేశం, పాకిస్తాన్‌లను మినహాయిస్తే మిగిలిన అన్ని దేశాల్లో లింగ నిష్పత్తి అతి కొద్ది తేడాలతో సరిసమానంగా 50 :50 ఉందని ఈ సంస్థ విశ్లేషించింది. మన పొరుగు దేశమైన పాకిస్తాన్లో ప్రకటించిన 4004 కేసులలో 72 శాతం పురుషులు.

గ్రీసులో 17,551 కేసులలో 55 శాతం పురుషులు. ఇటలీలో 1,24,547 కేసులలో 53 శాతం పురుషులు. ఫిబ్రవరి 28 తర్వాత గణాంకాలు సరిచేయనప్పటికీ చైనాలో కూడా 55,924 కేసులలో స్రీ, పురుష నిష్పత్తి 51 :49 గా ఉంది. దక్షిణ కొరియా మరొక అసాధారణ మినహాయింపు. దక్షిణ కొరియాలో అత్యధిక జనాభాకు ఈ పరీక్షలు నిర్వహించారు. రోగ నిర్ధారణ అయినవారిలో పురుషుల కంటే మహిళల సంఖ్య అధికంగా నమోదైంది. దక్షిణ కొరియాలో ఏప్రిల్ ఎనిమిదో తేదీ వరకూ వెల్లడైన మొత్తం పది వేల కేసులలో 60 శాతం మహిళలు వుండటం గమనార్హం. కోవిడ్ -19 నిర్ధారణ పరీక్షలు గణనీయంగా జరుపుతున్న మరొక దేశం జర్మనీ. రోగ నిర్ధారణ జరిగిన మొత్తం 92,255 కేసులలో పురుషుల - మహిళల నిష్పత్తి సరిసమానంగా ఉంది. అయితే అందుబాటులో ఉన్న 18 దేశాల గణాంకాల ప్రకారం అన్ని దేశాల్లో మరణాల సంఖ్య మాత్రం మహిళల కంటే పురుషులలో రెట్టింపు నమోదవుతుంది. కోవిడ్-19 మరణాలలో పురుషుల- మహిళల నిష్పత్తి భారత దేశం మాత్రం ప్రకటించలేదు.

నిపుణుల అంచనా ప్రకారం భారతదేశ గణాంకాలలోని ఈ అత్యధిక అసమానతకు కారణం సామాజిక- ఆర్థిక అంశాలే. పరీక్షలు ఎక్కువగా నిర్వహిస్తే, పురుషులు - మహిళల మధ్య గణాంకాల అంతరం తగ్గుముఖం పట్టే అవకాశం ఉన్నది. అనేక ఇతర దేశాలలో వ్యాధి ప్రధాన వాహకాలైన అంతర్జాతీయ ప్రయాణీకులలో మహిళలు - పురుషులు సుమారుగా సరిసమానంగా న్నారని భారత ప్రజారోగ్యశాఖతో సంబంధం ఉన్న అంటువ్యాధుల నిపుణుడు గిరిధర్ బాబు అన్నారు. భారతదేశంలోని ఉద్యోగిత స్థితిని కూడా ఈ అంశం ప్రతిబింబిస్తుంది. ఉద్యోగ పరంగా, పని నిమిత్తం ఇతర దేశాలకు ప్రయాణిస్తున్న మహిళల సంఖ్య భారతదేశం లో తక్కువగా ఉన్నది అని గిరిధర్ బాబు వ్యాఖ్యానించారు.

పరీక్షలు నిర్వహించడంలో వ్యత్యాసం, అంతర్జాతీయ ప్రయాణాలలోనూ, ఉద్యోగాల లోనూ స్త్రీల సంఖ్య తక్కువగా ఉండటం భారత్, పాకిస్తాన్‌లలో స్త్రీల అసమాన స్థితిని కోవిడ్ పరీక్షల లెక్కలు ధ్రువ పరుస్తున్నాయి. ✹

# హేళనలు - నిందలు - హింస

## లాక్ డౌన్ కాలంలోనూ గృహ హింసకు పడని తాళం



రోజంతా ఇంట్లోనే గడపవలసిన పరిస్థితి ఏర్పడింది. పురుషాహంకారాన్ని ప్రదర్శించ డానికి హింస ఒక మార్గమని గృహహింసకు సంబంధించిన వివిధ నివేదికలు వెల్లడిస్తున్నాయి. ప్రస్తుతం పని కోల్పోయి ఆహార భద్రత లేక, భవిష్యత్తు గురించిన భయానక వాతావరణం పురుషులలో అసంతృప్తిని కల్పిస్తున్నది. ఈ అంశాలన్నీ ఆందోళనను పెంచిన పర్యవసానంగా మహిళలు మరింత బాధితులు అవుతున్నారు. స్నేహితులు, ఇతర కుటుంబ సభ్యులు, సంఘాలను కలిసే అవకాశం లేకపోవడం బాధిత మహిళల పరిస్థితిని మరింత దయనీయంగా మార్చింది.

**దేశంలో...!**

జాతీయ కుటుంబ ఆరోగ్య సర్వే లెక్కల ప్రకారం 2015 - 16 సంవత్సరంలో 24 శాతం మంది మహిళలు మనదేశంలో గృహహింసను ఎదుర్కొన్నారు. వాస్తవానికి 2005- 06 నుంచి ఇదే పరిస్థితి కొనసాగుతోంది.ఏ మాత్రము మెరుగు పడలేదు. లక్ష మంది బాధితులు వుంటే వారిలో 58.8 మంది మాత్రమే పోలీసు

మనదేశంలో లాక్ డౌన్ స్థితిలోనూ మహిళలపై గృహహింస ఆమూలాగ్రం అడ్డూ అదుపు లేకుండా సాగుతోంది. లాక్ డౌన్ మొదలైన మొదటి వారంలోనే జాతీయ మహిళా కమిషన్ అందుకున్న 257 ఫిర్యాదులలో ఒకటి రాజస్థాన్‌కు చెందిన ఒక తండ్రి చేసిన ఫిర్యాదు. లాక్ డౌన్ మొదలైనప్పటి నుంచీ తన కూతురుకు తిండి కూడా పెట్టకుండా ఆమె భర్త కొడుతున్నాడని ఫిర్యాదు. ప్రపంచ వ్యాపితంగా గృహహింసను మౌనంగా భరిస్తున్న స్థితిని ఈ ఫిర్యాదు వెలుగులోకి తెచ్చింది. లాక్ డౌన్ వలన గృహ హింస మరింత పెరిగినట్లు చైనా, ఫ్రాన్స్, ఇంగ్లాండ్ తదితర అనేక దేశాల నుంచి నివేదికలు వస్తున్నాయి. గృహహింస తీవ్రమైన విషయంగా పరిగణించాల్సిన అవసరాన్ని ఈ ప్రపంచ నివేదికలు తేట తెల్లం చేస్తున్నాయి.

పురుషులూ - మహిళలు పనులకు వెళ్లే సందర్భాలలో భార్యాభర్తలు కలిసి మాట్లాడుకునే సమయం పరిమితంగా ఉండేది. గృహహింస తక్కువగా ఉండడానికి ఇది కూడా ఓ కారణంగా అనేక నివేదికల ద్వారా తెలుస్తున్నది. లాక్‌డౌన్ వల్ల బయట ప్రపంచంతో సంబంధాలు తెగిపోయాయి.

**గృహ హింస బాధితులను అపవాదుల పాలు చేయడాన్ని తగ్గించే పనిని సత్వరమే చేపట్టాలి. ఇటువంటి మద్దతు అపనిందలు -హింసల పాలైన మహిళలకు తమ సమస్యకు పరిష్కార మార్గాలను వెతుక్కునే స్ఫూర్తిని ఇస్తుంది. హింసకు గురైన మహిళలు దగ్గరలోని పోలీసు స్టేషన్ నుంచి గానీ రాష్ట్ర మహిళా కమిషను నుంచిగానీ సహకారం తీసుకోవాలని జాతీయ మహిళా కమిషను విజ్ఞప్తి చేస్తున్నది. ఇది కనీసంగా చేయగలిగినది.మహిళల హక్కులకు అండగా నిలబడే అనేక ఇతర మార్గాలు ప్రస్తుతం అందుబాటులో ఉన్నాయి. నగదు బదిలీ, రేషన్ పంపిణీ కుటుంబాలపై ఒత్తిడి తగ్గించి నిలదొక్కుకునే అవకాశం కల్పిస్తాయి. ఇవి కొంత గృహ హింస తగ్గడానికి అవకాశం కల్పిస్తాయి.**

స్టేషన్లలో ఫిర్యాదు చేస్తున్నట్టు వివిధ పరిశీలనల నివేదికలు స్పష్టం చేస్తున్నాయి. పోలీసు స్టేషన్లలో కేసు నమోదు చేసేందుకు ఇతరుల సహాయం తీసుకోడానికి మహిళలు మానసికంగా సిద్ధంగా లేరని ఈ పరిశీలనలల్లో తేలింది. ఎన్ ఎఫ్ హెచ్ ఎస్ లెక్కల ప్రకారం భార్యను కొట్టడానికి భర్తకు ఏదో ఒక సహేతుకమైన కారణం ఉంటుంది అనే సమాధానం 52 శాతం మంది మహిళల నుంచీ, 42 శాతం మంది పురుషుల నుంచీ వచ్చింది. ఈ లెక్కలే నిందలకూ, హింసకూ గురైన మహిళ ఇతరుల సహకారం ఆశించకూడదు అన్న భావం ఎంతగా వేళ్లూనుకుని ఉందో, సర్వ సాధారణం అనుకుంటున్నారో తేటతెల్లం చేస్తున్నాయి. తక్కువ ఆదాయ వర్గాల కుటుంబాలకు చెందిన మహిళల నుంచి ఫిర్యాదులు ఇటీవల పెరుగుతున్నాయి. ప్రపంచవ్యాప్తంగా కరోనా వ్యాధి కారణంగా విధించిన లాక్ డౌన్ వలన దాదాపు అందరి ఆదాయాలూ గణనీయంగా పడిపోయాయి. మద్యం అలవాటు కారణంగా గృహ హింస రెట్టింపు అవుతుంది. మద్యం అలవాటుకూ గృహహింసకూ అవినాభావ సంబంధం వున్నట్లు ఎన్ ఎఫ్ హెచ్ ఎస్ లెక్కలు కూడా చెబుతున్నాయి. మద్యం అందుబాటులో లేనందువల్ల వచ్చే నిరాశా నిస్పృహలు హింసకు దారితీస్తున్నాయి.



**ఏమి చేయాలి?**

గృహ హింస బాధితులను అపవాదుల పాలు చేయడాన్ని తగ్గించే పనిని సత్వరమే చేపట్టాలి. ఇటువంటి మద్దతు అపనిందలు -హింసల పాలైన మహిళలకు తమ సమస్యకు పరిష్కార మార్గాలను వెతుక్కునే స్ఫూర్తిని ఇస్తుంది. హింసకు గురైన మహిళలు దగ్గరలోని పోలీసు స్టేషన్ నుంచి గానీ రాష్ట్ర మహిళా కమిషను నుంచిగానీ సహకారం తీసుకోవాలని జాతీయ మహిళా కమిషను విజ్ఞప్తి చేస్తున్నది. ఇది కనీసంగా చేయగలిగినది. మహిళల హక్కులకు అండగా నిలబడే అనేక ఇతర మార్గాలు ప్రస్తుతం అందుబాటులో ఉన్నాయి. నగదు బదిలీ, రేషన్ పంపిణీ కుటుంబాలపై ఒత్తిడి తగ్గించి నిలదొక్కుకునే అవకాశం కల్పిస్తాయి. ఇవి కొంత గృహ హింస తగ్గడానికి అవకాశం కల్పిస్తాయి. లాక్ డౌన్ మొదలైనప్పటి నుంచీ టీవీలో వార్తలు చూడడం పెరిగింది. విషయాలు చేరవేసేందుకు ఇదొక మంచి అవకాశం. అవసరమైనప్పుడు పోలీసుల సహకారం తీసుకోవాలని మహిళలకు విజ్ఞప్తి చేసేందుకు జాతీయ మహిళా కమిషన్ టీవీల్లో ప్రకటనలను పెంచాలి. గృహ హింస బాధితుల సహాయం కోసం నిర్దేశించిన ఫోను నంబర్లను నిరంతరాయంగా ప్రసారం చేయాలి కోవిడ్-19 విపత్కర సమయంలో అందరికీ ఎస్ఎంఎస్ పంపించినట్లు ప్రభుత్వం అందరి ఫోన్లకూ సమాచారం పంపించాలి. సాధారణ ఫోన్లు మహిళలకు అందుబాటులో ఉంటాయి కనుక ప్రభుత్వం ఈ ప్రయత్నం చేయాలి.

గృహహింసకు వ్యతిరేకంగా పోరాడుతున్న సంఘాలకు ఫ్రాన్సు ప్రభుత్వం ఆర్థిక సహాయాన్ని అందిస్తున్నది. తత్సంబంధిత సమస్యలపై పనిచేసే సంఘాలకు చేయూతనిచ్చే అత్యవసర నిధిని విడుదల చేయాలని బ్రిటన్‌లో కార్యకర్తలు ప్రభుత్వాన్ని కోరుతున్నారు. ఇప్పటికే సాంఘిక సంక్షేమ కార్యకలాపాలతో తీవ్ర ఒత్తిడిని ఎదుర్కొంటున్న ఆశ, అంగన్వాడీలపై ఆధారపడకుండా భారత ప్రభుత్వం కూడా ఇటువంటి సంఘాలకు ఆర్థిక సాయాన్ని అందించాలి. ఆ సంఘాల కార్యకర్తలను పోలీసులు అడ్డుకోకుండా అనుమతించాలి.

అంటువ్యాధులు ప్రబలే సందర్భంలో పురుషుల కంటే మహిళలు తీవ్రంగా ప్రభావితులవుతారని అనేక అధ్యయనాలు తెలియ జేస్తున్నాయి. ఈ అధ్యయనాలకు ప్రాధాన్యత ఇచ్చి వాటి ద్వారా వెల్లడయిన సూచనలకు అనుగుణంగా చర్యలు తీసుకోవాలి. సమాజంలో స్త్రీ పురుషుల మధ్య అగాధం పెరగకుండా జాగ్రత్త వహించాలి.

**(అనువాదం అరుణ)**

# కరోనా కాలం - వలస కార్మికుల వెతలు



"కూలి కోసం కూటి కోసం పట్టణంలో బతుకుదామని బయలుదేరిన (వలస జీవికి) బాటసారికి ఎంత కష్టం ఎంత కష్టం" అంటూ శ్రీశ్రీ ఏనాడో రాసిన గీతం నేటి కరోనా కాలంలో వలసకార్మికుల వెతలకు అద్దం పట్టింది. వారి యదార్థ జీవన వ్యథార్థ కథలు సామాజిక మాధ్యమాల్లోనూ, టీవీల్లోనూ చూసిన వారి హృదయాలను ద్రవింపచేశాయి.

కరోనా వచ్చి వ్యవస్థలను కూల్చలేదు. వ్యవస్థలోని డొల్లతనాన్ని బట్టబయలు చేసింది. వలస కార్మికుల నడక దృశ్యాలూ, వారి వేదనలూ వ్యవస్థలోని డొల్లతనం బట్టబయలు చేశాయి. హృదయం లేని ప్రభుత్వాల సిగ్గులేని తనాన్ని ఎత్తిచూపింది. ఈ ప్రపంచం డబ్బుతో నడవదనీ, శ్రమతోనే నడుస్తుందన్న సత్యం ఈ కాలంలో కొందరికైనా బోధపడింది. అనేక పాఠాలను నేర్పింది.

ఆలస్యంగానైనా ప్రమాదాన్ని గుర్తించిన కేంద్ర ప్రభుత్వం కరోనాను అడ్డుకోవడానికి చైనా అవలంభించిన లాక్ డౌన్ పద్ధతిని అమలు చేసింది. మళ్లీ మళ్లీ పొడిగించు కుంటూ పోయారు. దీంతో సంపన్నులు, మధ్యతరగతి ప్రజలు పెద్దగా ఇబ్బందులు గురి కాకపోయినా పేద కార్మికులకు మాత్రం ఇక్కట్లు మొదలయ్యాయి. పనులు లేవు. ఆకలి పెరిగింది.

బీహార్, పశ్చిమ బెంగాల్ చత్తీస్ గఢ్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్ మొదలైన రాష్ట్రాల నుంచి వలస వచ్చి ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, బెంగళూరు, చెన్నయిలో పనిచేస్తున్న కోట్లమంది వలస కార్మికులు పనులు లేకపోవడంతో, వారికి బతకడమే గగనంగా మారింది.

కరోనా కన్నా ఆకలి భయమే వారిని వేధించింది. కంపెనీ యజమానులు కార్మికులను తొలగించకుండా జీతాలు ఇచ్చి ఆదుకోవాలని ప్రభుత్వాలు నోటిమాటగా చెప్పాయి. కానీ యజమానులు వాళ్లను పట్టించుకోలేదు.

ప్రణాళిక లేకుండా, బాధ్యత వహించకుండా అమలు చేసిన లాక్ డౌన్ విపరీత పరిణామాలకు తెరతీసింది. భవిష్యత్తు అగమ్యంగా మారింది. కేరళలో లెఫ్ట్ ప్రభుత్వం మాత్రం వలసవచ్చిన కూలీలను అతిథులుగా ప్రకటించి, అన్ని సౌకర్యాలూ కల్పించింది. పొట్ట చేత పట్టుకొని వచ్చిన జనం తమకాళ్లను చెప్పులు గా చేసుకుని తమ వూరికి దారెటో తెలియకపోయినా పోలోమంటూ పోటెత్తారు పెట్టె బేడా సర్దుకుని. వేల కిలోమీటర్ల ప్రయాణాన్ని నడకతో ప్రారంభించిన వారి ధైర్యాన్ని అందరూ మెచ్చుకోవాల్సిందే. కానీ వారి మార్గం కఠినతరమైనది. పిల్లలు, వృద్ధులు, మహిళలు, గర్భవతులు, వికలాంగులు ఇలా వేలాది మంది తాము పనిచేస్తున్న చోట నుంచి స్వస్థలాలకు పయన మయ్యారు.

ఎక్కడో విదేశాల్లో నిలిచి పోయిన భారతీయుల కోసం విమానాలు ఏర్పాటు చేసి తీసుకొచ్చారు. దేశ నిర్మాణానికి మూల స్తంభాలుగా ఉన్న శ్రామికుల అగచాట్లను మాత్రం పట్టించుకోలేదు. ప్రభుత్వం చెబుతున్న ప్రకారం ఈ వలస కార్మికులు 8 కోట్ల మంది ఉంటారు. వాస్తవానికి వీరు 15 నుంచి 20 కోట్ల మధ్యలో ఉంటారని నిపుణులు అంచనా. ఆకలి చావుల కన్నా కరోనా చావే నయమన్న నిర్ణయానికి వచ్చి నడక బాట పట్టిన ఈ వలస కార్మికులకు కనీసం రైళ్లూ, బస్సులు ఏర్పాటు చేయలేదు.

బెంగళూరు నుంచి వలస కార్మికులు అనంతపురం హైవే మీద నడుచుకుంటూ బయలుదేరారు. వందలాది మంది గుంపులు గుంపులుగా ఎర్రటి ఎండలో నడిచారు. చంకలో బిడ్డను ఎత్తుకుని ఎంతో మంది నడిచారు. వీరి బాధను చూడలేక సీపీఎం ఆధ్వర్యంలో కొడికొండ చెక్పోస్ట్ దగ్గర, రాప్తాడు దగ్గర, అనంతపురం దగ్గర మొదలై ఈ చివర కాకినాడ వరకు దారంతా టెంట్లు వేసి వారి ఆకలి దప్పులు తీర్చారు. ఖాళీ లారీలు పోతుంటే వాళ్ళని అడిగి ఈ వలస కార్మికులను ఎక్కించి పంపించారు.

అనంతపురం హైవేపై బీహారు కార్మికులు ప్రయాణిస్తున్న ఆటో డ్రైవరుకు

**ఎక్కడో విదేశాల్లో నిలిచి పోయిన భారతీయుల కోసం విమానాలు ఏర్పాటు చేసి తీసుకొచ్చారు. దేశ నిర్మాణానికి మూల స్తంభాలుగా ఉన్న శ్రామికుల అగచాట్లను మాత్రం పట్టించుకో లేకపోయారు. ప్రభుత్వం చెబుతున్న ప్రకారం ఈ వలస కార్మికులు 8 కోట్ల మంది ఉంటారు. వాస్తవానికి వీరు 15 నుంచి 20 కోట్ల మధ్యలో ఉంటారని నిపుణులు అంచనా. ఆకలి చావుల కన్నా కరోనా చావే నయమన్న నిర్ణయానికి వచ్చి నడక బాట పట్టిన ఈ వలస కార్మికులకు కనీసం రైళ్లు, బస్సులు ఏర్పాటు చేయలేదు.**

పోలీసులు కనిపించడంతో సడన్ బ్రేక్ వేశాడు. వెనుక నుంచి వేగంగా వస్తున్న కారు ఆటోను ఢీ కొట్టింది. ఆటోకు వెనుక వైపున కూర్చుని ఉన్న వాళ్ళ కాళ్లు విరిగిపోయాయి. సీపీఎం నాయకులు వారిని బెంగళూరు ఆసుపత్రికి తీసుకెళ్లి వైద్యం చేయించారు.

మహారాష్ట్రలోని నాసిక్ నుంచి మధ్యప్రదేశ్లోని తన సొంత గ్రామమైన సత్నాకు భర్త తో కలిసి బయలుదేరిందో శ్రామిక మహిళ. ఆమె గర్భవతి కూడా. మార్గమధ్యంలో నొప్పులు ప్రారంభమై బిడ్డకు జన్మనిచ్చింది. రెండు గంటలు విశ్రాంతితో మళ్ళీ ఆమె 150 కిలోమీటర్లు నడిచింది. తెలంగాణలోని సంగారెడ్డి జిల్లా నుంచి మరో శ్రామిక మహిళ కూడా ఛత్తీస్గఢ్లోని రాజ నంద్గాన్ గ్రామానికి నడుస్తూ నార్సింగ్ లోని జాప్తి శివనూర్ గ్రామం వద్ద బిడ్డను ప్రసవించింది. రామాయంపేట ఆసుపత్రిలో ఆమెను చేర్చారు.

మహారాష్ట్రలోని ఔరంగాబాద్ నుంచి మధ్యప్రదేశ్ కు వెళ్తున్న 17 మంది కార్మికులు నడిచి నడిచి అలసిపోయి రైల్వే ట్రాక్పై పడుకున్నారు. వారు గాఢ నిద్రలో ఉండగా తెల్లవారు జామున వారిపై గూడ్స్ రైలు వెళ్ళింది. ఈ సంఘటన మే ఎనిమిదో తేదీన జరిగింది.

కర్నూలు జిల్లా ఆదోని మండలం నుంచి బెంగళూరు ముంబైలలో సిమెంటు పనుల కోసం వెళ్లారు. గుంటూరుకు మిర్చి పనిమీద వెళ్లారు. గుంటూరు నుండి ఆదోనికి కార్మికులంతా నడుచుకుంటూ వచ్చారు. తెలంగాణ నుంచి ఛత్తీస్ గడ్ పోతూ చాలా మంది చనిపోయారు. అలాగే గుంటూరు నుంచి వచ్చే వాళ్ళు కూడా కొంత మంది చనిపోయారు. చనిపోయిన వారి కుటుంబాలకు ఐదు లక్షల ఆర్థిక సహాయాన్ని అందించాలని సీపీఎం నాయకులు మధు ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు.

బొంబాయిలో వలస కూలీలు శ్రామిక రైలు కోసం పెద్ద ఎత్తున గుమికూడారు. వారిని చెల్లాచెదురు చేయటానికి లాఠీఛార్జి కూడా చేశారు. అనంతపురం జిల్లాలోని విడపనకల్లు, గుత్తి, గుంతకల్లు, పుట్లూరు, యల్లనూరు, అమడగూరు ప్రాంతాల నుంచి బిహార్, యూపీ, రాజస్థాన్ రాష్టాలకు చెందిన



కార్మికులంతా నడకనే బయలుదేరారు. విడపనకల్లులో తమ ఊరికి పోనివ్వండంటూ పోలీసులపై కార్మికులు దాడికి దిగారు.

ఆర్థిక వ్యవస్థను గాడిలో పెట్టడానికి ఆర్థిక ప్యాకేజీ ఇచ్చింది కేంద్ర ప్రభుత్వం. 20 లక్షల కోట్ల రూపాయలతో ఆర్థిక ప్యాకేజీ ప్రకటించారు. అందులో వలస కార్మికులకు బియ్యం, శనగలు ఉచితంగా ఇస్తామని చెప్పింది. చాలామంది ఆర్థిక నిపుణులు ప్రజలకు నెలకు ఏడు వేల ఐదు వందల రూపాయలు ఇవ్వాలని ప్రతిపాదించారు. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ఆర్థిక సాయాన్ని అందించాలని కేంద్రాన్ని కోరాయి. కనీసం రెండు వేల కోట్లు ఇచ్చి ఉన్నా ఈ కష్టకాలంలో వారిని ఆదుకోగలిగేవారు. అదీ చేయలేదు. ఇదొక నిర్లక్ష్యపూరిత అమానవీయ చర్య. కేంద్ర ప్రభుత్వం తమ దేశ వాసులపట్ల తీసుకున్న నిర్దయాపూర్వక వ్యవహారం.

ఇప్పుడు కరోనా ఇంకా విజృంభిస్తూనే ఉంది దేశంలో. వలస కార్మికులు తమ ఊర్లకు పోవడం వల్ల గ్రామీణ ప్రాంతాల్లోకి కూడా కరోనా సోకుతుందని పరిశీలకులు చెబుతున్నారు. ఇది లాక్ డౌన్ ను ప్రణాళికాబద్ధంగా చేయకపోవడం వల్ల జరిగిన విపత్తు.

ఇలాంటి విషాదాలు భవిష్యత్తులో జరక్కుండా ప్రభుత్వాలు పకడ్బందీగా చర్యలు చేపట్టాలని మనమంతా ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాల్సిన అవసరం ఉంది. అదే సమయంలో కరోనాను పారద్రోలి ప్రజలను రక్షించుకోవాల్సిన బాధ్యత అందరిమీద ఉందని గుర్తెరగాలి.

✷

# 'రావు బహద్దూర్' కందుకూరి

వీరేశలింగంపై 1890 జులై 15న రూ. 3000కు లక్ష్మీ నరసింహం వేసిన పరువు నష్టం దావా మూడేళ్లు నడిచింది. 1893 మార్చి 3న తీర్పు వెలువడింది. దానిలో 'ఇళ్ల మీద రాళ్లు వేయించిన వాళ్లు పెద్ద మనుషులుగా పరిగణింప బడుతున్నారు' అని పంతులు గారు 'వివేకవర్ధని'లో రాసిన ఒక్క వాక్యాన్ని మాత్రమే తప్పు పడుతూ, పరువు నష్టం కింద వాదికి ఒక అణా చెల్లించమంటూ న్యాయమూర్తి తీర్పు చెప్పారు. కోర్టు ఖర్చులు ఎవరికి వారే భరించమని తేల్చి చెప్పారు. తరువాత కాలంలో వీరేశలింగం కనపడితే నమస్కారం పెట్టి మాట్లాడేవాడు లక్ష్మీ నరసింహం. సభా భవనము నిర్మాణ సమయంలోనే ప్రార్థనా మందిరాన్ని కూడా కట్టాలని కందుకూరి తలపెట్టారు. ప్రార్థన మందిరం నిర్మాణానికి సొంత డబ్బులే కాకుండా చందాలు కూడా వచ్చాయి. టి. శేషాచలం నాయుడు రూ. 100 ఇచ్చారు. రాజగౌడ్ నారాయణ గణపతి రావు బహదూర్ సి.ఎ. రూ.300 పంపించారు. న్యాపతి సుబ్బారావు రూ. 50, కనపర్తి శ్రీరాములు రూ. 50, ఆర్. వెంకటరత్నం రూ. 50, పెద్దిబొట్ల వెంకటసుబ్బయ్య రూ. 50, రాయసం వెంకటశివుడు రూ. 50 లెక్కన చందాలు ఇచ్చారు. వీరేశలింగం అడగ కుండానే ఇద్దరు మహిళలు ఐదు రూపాయల చొప్పున, ఒకరు 3 రూపాయలు విరాళంగా పంపారు. ధనికులైన పురుషులిచ్చిన 100 రూపాయల కంటే అస్వతంత్రులైన మహిళలు ఇచ్చే చందాలు చాలా విలువైనవని పంతులుగారు వ్యాఖ్యానించటం విశేషం. ప్రార్థన మందిరము కట్టించడంలో పంతులుగారికి రెబ్బాప్రగడ పాపయ్య తోడుగా నిలిచారు. రూ. 1500తో ప్రార్థన మందిరము పూర్తయింది. ఆర్. వెంకటరత్నం నాయుడు బందరు నుంచి వచ్చి 1887 ఏప్రిల్ 17న దానిని ప్రారంభించారు. 1893 ప్రారంభంలో



వీరేశలింగానికి ఆంగ్లేయ ప్రభుత్వం రావుబహద్దూర్ బిరుదును ప్రదానం చేసింది. అందుకు తాను అర్హుడనో కాదో తెలీదని వీరేశలింగం రాసుకున్నాడు. అయితే అనేక ప్రాంతాల నుంచి అభినందన పత్రాలు, ప్రశంసా పత్రాలు లెక్కలేనన్ని వచ్చాయి. అభినందనలు, ప్రశంసనలలో ముంచెత్తుతూ అనేక మంది రాసిన వాటిలో పంతులుగారు ఒక దానిని మాత్రమే తన పత్రికలో ప్రచురించుకున్నారు. రాజమహేంద్రవరం కళాశాల ప్రధానోపాధ్యాయుడు, మెట్కాఫ్ దొర, మదరాసు ప్రభుత్వ తెలుగు అనువాదకుడు రంగయ్య శెట్టి తదితర పలువురు పెద్దలు వీరేశలింగానికి రావుబహద్దూర్ బిరుదు లభించినందుకుగాను మనస్ఫూర్తిగా అభినందనలు తెలిపారు. "వ్యక్తిగతంగా మీరు పరిచయం లేకపోయినా, మీ గురించీ, మీ సంస్కరణల గురించీ గొప్పగా విన్నాను. మీ వ్యక్తిత్వానికి దక్కిన ఈ గౌరవానికి నేను మిమ్మల్ని చూసి గర్విస్తున్నాను. మీకు నా అభినందనలు" అంటూ శుభాకాంక్షల లేఖలు పంపారు. కాకినాడ నుంచి సాహిత్య సంఘ సభ్యులు పంతులు గారిని అభినందిస్తూ – "భారత దేశానికి మీరు అందించిన సేవలు అత్యంత విలువైనవి. మీ సేవలు సదా ఈ దేశానికి అందించడానికి భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించాలని కోరుకుంటున్నాము" అని తెలిపారు. ఆంగ్ల, తెలుగు వార్తా పత్రికలలోనూ పంతులుగారి గూర్చి అనేక వ్యాసాలు ప్రచురితమయ్యాయి. పంతులుగారు ఒక్క 'ఆంధ్ర ప్రకాశిక' పత్రికలో మాత్రమే వ్యాసం రాశారు. పత్రికలో వచ్చిన వ్యాసాల సారాంశం ఇదీ ... "రాజమహేంద్రవరం ప్రభుత్వ ఫస్ట్ గ్రేడ్ కళాశాలలో ప్రధాన పండితులగు మహారాజ రాజశ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారికి ఈ సంవత్సరం ఆరంభంలో బ్రిటీష్-ఇండియా ప్రభుత్వం "రావు బహద్దూర్" బిరుదును ప్రదానం చేశారు. ప్రస్తుతము ఆంగ్ల భాష అభ్యసించిన నాగరికులందరిలోనూ ఈయన మహనీయులు. వీరేశలింగం అద్భుతమైన నీతి ప్రవర్తన కలిగినవారు. తెలుగు గ్రంథముల వ్యాప్తికీ, అభివృద్ధికీ ఈయన పడిన శ్రమ, సంఘ సంస్కరణలకు 20 సంవత్సరాలపాటు పడిన కష్టము, ముఖ్యంగా స్త్రీల పునర్వివాహములకు పంతులుగారు తన ధనము, కాలము, శక్తి వినియోగించటం బహుదా ప్రశంసనీయం. ఆయన సదా దేశ క్షేమం కోరి నడుచుకున్నారు. ఇవన్నీ సర్వజనులలోనూ ఆ మహనీయుడికి మిక్కిలి ఖ్యాతి కలుగజేశాయి. ఆయన సత్కారములు, కీర్తి ఆశించివవారు కాదు. సత్కార్యములను పట్టుదలతో నిర్వహించేవారు. సర్వ పాప కార్యముల పట్ల, ఆడంబరాలు పట్ల విముఖత కల్గి ఉండుట, సర్వ జనోపయోగకరమైన పనులను సదా చేయు చుండుట ఆయన సత్ప్రవర్తనకు నిదర్శనములు. ఆయన తెలుగులో వచన కావ్యాలు, పద్య కావ్యాలు, నాటకాలు, ఉపన్యాసాలు, శాస్త్రాలు మొదలైనవి 80 వరకు రాశారు. తెలుగు కావ్యాలకు పంతులుగారు పితృ సమానులు అని చెప్పవచ్చు. ఈయన రాసిన గ్రంథాలన్నీ మృదువైన సులభశైలిలో ఉంటాయి. నీతికలిగి, హిందూ దురాచార రోగాలకు ఔషధాలుగా ఉంటాయి.

(సశేషం)

# ప్రభుత్వ రంగంలో ప్రజారోగ్యం!

## కరోనావైరస్ నేర్పుతున్న గుణపాఠం!!

డాక్టర్ ఎస్. సురేష్, అసిస్టెంట్ ప్రొఫెసర్,
కింగ్ ఫైజల్ యూనివర్సిటీ, సౌదీ అరేబియా



ప్రపంచ ఆరోగ్య సంస్థ తాజా గణాంకాల ప్రకారం కరోనా వైరస్ వ్యాధి 213 దేశాలకు విస్తరించింది. మే 29వ తేదీ నాటికి ప్రపంచవ్యాప్తంగా ఈ వ్యాధి సోకిన వారి సంఖ్య 59 లక్షలు దాటింది. మృతుల సంఖ్య 3.62 లక్షలకు చేరుకుంది. రోగుల, మరణాల సంఖ్యలో అమెరికా అగ్రస్థానంలో ఉంది. తరువాత స్థానాల్లో వరుసగా బ్రెజిల్, రష్యా, స్పెయిన్, ఇంగ్లాండు, ఇటలీ, ఫ్రాన్స్, జర్మనీ, ఇండియా, టర్కీ దేశాలు ఉన్నాయి. ఇంతకాలం ప్రపంచంలో అమెరికా పట్ల వున్న అనేక అభిప్రాయాలను కరోనా వ్యాధి మార్చేసింది. కరోనా వ్యాధిని ఎదుర్కోవడం లో అమెరికా వైద్య వ్యవస్థ వైఫల్యం ప్రపంచమంతటా చర్చనీయాంశమైంది.

కొరోనా వ్యాధిగ్రస్తులకు చికిత్స అందిస్తున్న అమెరికన్ వైద్యుడు కీత్ కార్ల్ – తన దేశ వైద్య వ్యవస్థ పట్ల తీవ్ర వ్యతిరేకత వ్యక్తం చేశారు. "మా వైద్య సామర్థ్యం పట్ల మాకు అవాస్తవికమైన విశ్వాసం ఉండేది. కానీ ఈ రోజు చూస్తే వాస్తవంగా మా దగ్గర ఉన్నది ఏమిటి? ప్రపంచంలోనే అత్యధిక సంఖ్యలో కరోనా కేసులు నమోదయ్యాయి. కరోనా రోగులకు తగిన చికిత్స అందించడానికే కాదు, వైద్యులను కాపాడుకోవడానికి కూడా మా ఆసుపత్రులకు తగిన సామర్థ్యం లేదు." మిలియన్ల డాలర్ల పెట్టుబడితో ఏర్పాటు చేసిన ప్రైవేటు మెడికల్ ఇన్సూరెన్స్ ఆధారంగా నడిచే అమెరికన్ ఆసుపత్రులలో వైద్యుల నిర్ణయాల కంటే ఎంబీఏ పట్టాలు పొందిన మేనేజర్ల నిర్ణయాలకు ప్రాధాన్యత ఎక్కువగా వుంటుందనీ చికిత్సలో నాణ్యత, రోగుల సంక్షేమం కంటే పెద్ద మొత్తంలో బిల్లులు వేయడం ద్వారా ఆసుపత్రులకు లాభాలు గడించడమే ప్రధానమని ఆయన వాపోయారు. అపరిమిత లాభాల వేటలో ఆసుపత్రుల యాజమాన్యాలు కీలకమైన విభాగాలలో కూడా తక్కువమంది వైద్యుల తోనూ, సిబ్బందితోనూ సరిపెడుతున్నారనీ, కరోనా విరుచుకు పడటానికి ముందే రోగుల అవసరాలకు తగిన సంఖ్యలో వైద్య సిబ్బంది లేరనీ, ఇప్పుడు పెద్ద సంఖ్యలో ఆసుపత్రు లలో చేరుతున్న కరోనా వ్యాధి గ్రస్తులకు చికిత్స అందించడానికి సిబ్బంది సంఖ్య ఎంత మాత్రమూ సరిపోవడంలేదనీ ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. ఆయన ఇంకా ఇలా అన్నారు – "కరోనా సంక్షోభం మొదలైన తరువాత మా ఆసుపత్రి యాజమాన్యం నుంచి నాకొక ఈ-మెయిల్ వచ్చింది. దాని సారాంశం ఏమిటంటే ఒక రోగికి నేను అందించే చికిత్స ద్వారా ఆసుపత్రికి ఎంత ఆదాయం వస్తుంది అనే వివరాలను ఫీజులు వసూలు చేసే విభాగానికి అందించిన తర్వాత మాత్రమే నేను ఆ రోగికి చికిత్స ప్రారంభించాలి. అత్యవసర విభాగంలో కరోనా వ్యాధిగ్రస్తులకు చికిత్స అందించే వైద్యులు చాలీచాలని సర్జికల్ గౌన్లు, సాధారణ మాస్కులతో సరి పెట్టుకుంటున్నారు. మరొకవైపు చైనా వైద్యులు పూర్తిస్థాయి వ్యక్తిగత రక్షణ పరికరాలు ధరించి వైద్య సేవలు అందిస్తున్నారు. ఏప్రిల్ మూడో వారానికి అమెరికాలో సుమారు 70 మంది వైద్యులు మరియు నర్సులు కరోనావైరస్

వ్యాధితో మరణించారు. మరింత మందిమి రాబోయే రోజుల్లో ఈ జాబితాలో చేరతాం!".

కరోనా సంక్షోభం నేపథ్యంలో అమెరికన్ ప్రైవేటు ఈక్విటీ కంపెనీ 'అల్టియన్ హెల్త్' తన యాజమాన్యంలో పనిచేస్తోన్న 1700 మంది వైద్యులకు వేతనాలనూ, ఇతర సదుపాయాలనూ కుదిస్తూ నిర్ణయం తీసుకుంది. ఇందులో అనేక మంది వైద్యులు కరోనా రోగులకు సేవలు అందించే అత్యవసర వైద్య విభాగాలకు చెందినవారే కావటం గమనార్హం. ఇదంతా గమనిస్తే – లాభాలే కేంద్రంగా పనిచేసే ప్రైవేటు కార్పొరేట్ ఆసుపత్రులు, రోగులకే కాక వైద్య సిబ్బందికీ ఎంత ప్రమాదకరంగా తయారయ్యాయో అర్థమవుతుంది.

మరొక వైపున కరోనా రోగులకు సకాలంలో వైద్యం అందించడానికి చైనా 1000 పడకలు మరియు 1500 పడకల సామర్థ్యంగల రెండు ఆసుపత్రులను పది రోజుల్లో నిర్మించిందనే వార్త మనం గమనించాం. ఇవే కాక అనేక ప్రభుత్వ మ్యూజియాలనూ, పాఠశాలలనూ, ప్రైవేటు హొటళ్లనూ తాత్కాలిక ఆసుపత్రులుగా మార్చేశారు. దేశంలోని ఇతర ప్రాంతాల నుంచి పెద్ద ఎత్తున వైద్యులను, వైద్య సిబ్బందిని వూహాన్ నగరానికి తరలించి కరోనా రోగులకు చికిత్స అందించారు. అమెరికాలో లక్షకు పైగా కోవిడ్ మరణాలు నమోదు కాగా చైనా తన ప్రభుత్వ వైద్య వ్యవస్థను పూర్తి స్థాయిలో రంగంలోకి దించి మరణాలను 4,634 వద్ద నియంత్రించ గలిగింది. కరోనాపై పోరులో భాగంగా స్పెయిన్, ఐర్లాండ్ దేశాలు ప్రైవేటు ఆస్పత్రులను తాత్కాలికంగా జాతీయం చేశాయి. అమెరికాతో పోల్చితే ప్రభుత్వ ఆరోగ్య వ్యవస్థలు బలంగా ఉన్న జర్మనీ, రష్యా, సింగపూర్, దక్షిణ కొరియా, థాయ్‌లాండ్ వంటి దేశాలు కరోనా రోగులకు మెరుగైన వైద్య సేవలు అందించి, మరణాలను కొంతమేరకైనా నియంత్రించగలిగాయి. కరోనా మరణాలను నియంత్రించడంలో ఇంగ్లాండు వైఫల్యాలకు ప్రధాన కారణం గత దశాబ్ద కాలంగా తమ 'జాతీయ ఆరోగ్య సేవల' వ్యవస్థను బలహీనపరచటమేనన్న విమర్శలు వెల్లువెత్తాయి.

**మనదేశంలో రాజీవ్ ఆరోగ్యశ్రీ, ఆయుష్మాన్ భారత్ వంటి వివిధ రాష్ట్ర మరియు కేంద్ర ప్రభుత్వాలు ప్రారంభించిన బీమా పథకాల ద్వారా పెద్ద ఎత్తున నిధులు పొందిన కార్పొరేట్ ఆసుపత్రులు కరోనా రోగులకు చికిత్స అందించి, ప్రాణాలు కాపాడడానికి ముందుకు రాలేదు. దేశవ్యాప్తంగా కరోనాపై పోరులో ప్రభుత్వ సుపత్రులు ముందు వరుసలో నిలిచాయి. రక్షణ పరికరాల లేమి, సౌకర్యాల లేమి వంటి అనేక సవాళ్ళ మధ్యలో కూడా ప్రభుత్వ వైద్యులు, వైద్య సిబ్బంది అమూల్యమైన సేవలు అందించారు.**

మనదేశంలో రాజీవ్ ఆరోగ్యశ్రీ, ఆయుష్మాన్ భారత్ వంటి వివిధ రాష్ట్ర మరియు కేంద్ర ప్రభుత్వాలు ప్రారంభించిన బీమా పథకాల ద్వారా పెద్ద ఎత్తున నిధులు పొందిన కార్పొరేట్ ఆసుపత్రులు కరోనా రోగులకు చికిత్స అందించి, ప్రాణాలు కాపాడడానికి ముందుకు రాలేదు. దేశవ్యాప్తంగా కరోనాపై పోరులో ప్రభుత్వా సుపత్రులు ముందు వరుసలో నిలిచాయి. రక్షణ పరికరాల లేమి, సౌకర్యాల లేమి వంటి అనేక సవాళ్ళ మధ్యలో కూడా ప్రభుత్వ వైద్యులు, వైద్య సిబ్బంది అమూల్యమైన సేవలు అందించారు. కరోనాను కట్టడి చేయడంలో అద్భుతమైన కృషితో 'కేరళ నమూనా'గా ప్రపంచ ఆరోగ్య సంస్థ, అంతర్జాతీయ మీడియా ప్రశంసలు అందుకున్న కేరళలో కూడా ప్రభుత్వ ఆరోగ్య వ్యవస్థదే ప్రధాన పాత్ర. జాతీయ నమూనా పరిశీలన గణాంకాల ప్రకారం 1996లో ప్రభుత్వ ఆసుపత్రులు అందిస్తున్న వైద్య సేవలు ఆ రాష్ట్రంలోని మొత్తం వైద్య సేవల్లో 28 శాతం ఉండగా ప్రస్తుతం ఇది 48 శాతానికి పెరిగింది. 2016లో అధికారం చేపట్టిన ఎల్డీఎఫ్ ప్రభుత్వం ప్రాథమిక ఆరోగ్య రక్షణ వ్యవస్థను బలోపేతం చేయడానికి "మిషన్ ఆర్ధ్రమ్" పేరుతో సమూల సంస్కరణలు చేపట్టింది. ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో కొత్తగా 5,700 మంది వైద్యులనూ, నర్సులనూ నియమించింది. నేడు కేరళలోని దాదాపు అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో ముగ్గురు వైద్యులు సేవలందిస్తున్నారు.

మన రాష్ట్రంలో అత్యధిక ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఒక్క వైద్యుడితోనే నడుస్తున్నాయి. ఇక్కడ ఓపీ సేవలు ఉదయం పూట మాత్రమే, అదీ అరకొరగా లభ్యమవుతాయి. కేరళలో గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయ పనులు, ఇతర వృత్తులు, చిన్న ఉద్యోగాలు చేసుకునే వారిని దృష్టిలో ఉంచుకుని ఉదయమే కాక సాయంత్రం కూడా ఓపీ సేవలను అందుబాటులోకి తీసుకువచ్చారు. రోగులకు అవసరమైన మందులు ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో ఉచితంగా లభిస్తాయి. దీనితో ప్రజలు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను వినియోగించుకోవడం పెరిగింది. ప్రభుత్వ ఆసుపత్రులలో లభించే ఉన్నత స్థాయి వైద్య సేవలు కూడా మెరుగయ్యాయి. ప్రభుత్వ వైద్య కళాశాలల ఆసుపత్రులు, జిల్లా ఆసుపత్రులు వంటి ఉన్నత స్థాయి వైద్య సంస్థలకు భవనాలు, వైద్య పరికరాల కోసం గత నాలుగేళ్లలో నాలుగు వేల కోట్ల రూపాయలు వెచ్చించారు. అన్ని ప్రభుత్వ వైద్య కళాశాలల ఆస్పత్రులలో క్యాన్సర్ వ్యాధి చికిత్సా కేంద్రాలను కూడా ప్రారంభించారు. ప్రతి జిల్లా కేంద్ర ఆసుపత్రిలో గుండె జబ్బులకు అధునాతన వైద్య సేవలు అందించడానికి క్యాత్ ల్యాబ్స్ ప్రారంభించారు. అన్ని తాలూకా స్థాయి ఆసుపత్రులలో డయాలసిస్ కేంద్రాలను ప్రారంభించారు. ఇవి కాక ఆరోగ్య ఉప కేంద్రాలు, గ్రామస్థాయిలో ఆశా కార్యకర్తలు వ్యాధి నివారణ కార్యక్రమాల అమలులో నిమగ్నమై ఉన్నారు. క్షేత్ర స్థాయి ఆరోగ్య సిబ్బంది ప్రజలతో మమేకమై కృషి

చేస్తున్నారు.

గ్రామీణ స్థాయి నుంచి అత్యున్నత స్థాయి వరకు మూడంచెలలో అత్యంత పకడ్బందీగా రూపొందించిన ప్రజారోగ్య వ్యవస్థ 2018లో నిఫా వ్యాధిని ఎదుర్కోవడంలో సమర్థవంతంగా వ్యవహరించింది. ఆ అనుభవం కొరోనా వ్యాధిని ఎదుర్కోవడానికి మరింతగా వుపయోగపడింది. కేరళ జనాభాలో దాదాపు 17 శాతం విదేశాలలో నివశిస్తున్నారు. వివిధ దేశాల నుంచి కేరళకు సందర్శకులు వస్తూ ఉంటారు. దీనితో కేరళకు అంతర్జాతీయ ప్రయాణికుల రాకపోకలు ఎక్కువ. అందుకే కేరళ రాష్ట్రానికి ప్యాండమిక్స్ ముప్పు మిగతా అన్ని రాష్ట్రాల కంటే ఎక్కువగా ఉంటుంది. మనదేశంలో కరోనా వైరస్ కేసులు ముందుగా నమోదయింది కేరళలోనే. కరోనా కారణంగా వూహాన్ నగరంలో లాక్ డౌన్ ప్రకటించడంతో అక్కడి వైద్య కళాశాల విద్యార్థులు స్వదేశాలకు పయనమయ్యారు. అలా కేరళకు వచ్చిన వారందరికీ విమానాశ్రయంలోనే పరీక్షలు నిర్వహించి, స్వచ్ఛంద గృహ నిర్బంధంలో ఉంచారు. అందులో ఒక విద్యార్థికి జనవరి 30న కరోనావైరస్ వ్యాధిని గుర్తించి త్రిస్సూర్ ప్రభుత్వ వైద్య కళాశాలలో చేర్చి చికిత్స అందించారు. కొద్ది రోజుల వ్యవధిలో వూహాన్ నుంచి వచ్చిన వారిలో మరో రెండు కేసులు గుర్తించి చికిత్స అందించారు. వీరి నుంచి వైరస్ వ్యాపించే అవకాశం వుందని భావించిన 3000 మందిని గృహ నిర్బంధంలో ఉంచారు. విదేశాల నుంచి వచ్చిన వారందరికీ పరీక్షలు నిర్వహించడం, కరోనా పాజిటివ్ వచ్చిన వారి నుంచి విస్తృతమైన సమాచారం సేకరించి వారి ద్వారా వైరస్ ఎవరికి వ్యాపించి ఉంటుందో ఆరా తీయడం, అటువంటి వారిని గుర్తించి, వారికి వ్యాధి లక్షణాలు లేనట్లయితే గృహ నిర్బంధంలో వుంచడం (హోమ్ ఐసోలేషన్), వ్యాధి లక్షణాలు ఉన్న వారిని లక్షణాల తీవ్రతను బట్టి తగిన ఆసుపత్రిలో చేర్చి చికిత్స

**అంతర్జాతీయ అనుభవాలు, మనదేశంలోని కేరళ అనుభవం పరిశీలించినప్పుడు కరోనాపై పోరులో ప్రభుత్వ ఆసుపత్రులు, ప్రజారోగ్య వ్యవస్థలే ప్రజలకు అండగా నిలబడ్డాయని మనకు అర్థం అవుతుంది.**

అందించడం ఇలా నాలుగంచెల వ్యూహాన్ని పకడ్బందీగా అమలు చేశారు. వైరస్ వ్యాప్తిని నివారించడమే కాక వ్యాధి బారిన పడిన వారికి చికిత్సనందించడంలో కూడా కేరళ అద్భుతమైన పనితీరు కనబరిచింది. ఇప్పటివరకూ కేరళలో నమోదైన 1004 కేసులలో మరణాలు కేవలం 7 మాత్రమే. జాతీయ స్థాయిలో ప్రతి వెయ్యి కేసులకు సగటున 28 మరణాలు సంభవించగా ప్రపంచ సగటు 61. కరోనావ్యాధి బారిన పడిన ఒక వృద్ధ జంట చికిత్స పొంది పూర్తిగా కోలుకోవడం పెద్ద సంచలనం కలిగించింది. వారి వయసు 93 మరియు 88 సంవత్సరాలు!

క్షేత్రస్థాయి ఆరోగ్య సిబ్బంది, స్థానిక స్వపరిపాలన సంస్థల సిబ్బంది, పోలీసు, కుటుంబశ్రీ స్వయం సహాయ బృందాలు, యువజన మహిళా సంఘాల కార్యకర్తల సహాయంతో కరోనా రోగుల నుంచి వైరస్ వ్యాపించడానికి అవకాశం ఉన్న ప్రతి ఒక్కరినీ గుర్తించడానికి, గృహనిర్బంధంలో ఉన్న వారికి కావలసిన నిత్యావసర వస్తువులు, మందులు అందజేయడానికి అద్భుతమైన కృషి జరిగింది. దేశంలోని ఇతర ప్రభుత్వాలకు భిన్నంగా తమ రాష్ట్రంలో చిక్కుకుపోయిన ఇతర రాష్ట్రాల వలస కార్మికులను కేరళ రాష్ట్ర ప్రభుత్వం తమ అతిధులుగా భావిస్తామని ప్రకటించింది. కేవలం ప్రకటనలకే పరిమితం కాకుండా దానిని ఆచరణలో చూపించింది. లాక్‌డౌన్‌లో చిక్కుకుపోయిన వారు ఆకలికి అలమటించకుండా రాష్ట్రం మొత్తం మీద మహిళా స్వయం సహాయక బృందాల ఆధ్వర్యంలో వెయ్యికి పైగా సామాజిక వంటశాలలను ప్రారంభించి రోజుకు ఐదు లక్షల భోజనాలను ప్రజలకు అందించారు. పాఠశాలలను మూసివేసినందున విద్యార్థులకు మధ్యాహ్న భోజనాన్ని వారి ఇంటికే అందజేశారు. రేషన్ కార్డుతో నిమిత్తం లేకుండా అవసరమైన వారందరికీ 19 రకాల సరుకులతో రేషన్ కిట్లను ఉచితంగా సరఫరా చేశారు. ఈ విధంగా కనీస అవసరాల కోసం ప్రజలు బయటకు రావాల్సిన అవసరం లేకుండా తగిన ఏర్పాట్లు చేయడంతో పాటుగా గృహనిర్బంధంలో వుంచిన వారిని కూడా తమ ఇల్లు దాటి బయటకు రాకుండా క్షేత్ర స్థాయి ఆరోగ్య సిబ్బంది పర్యవేక్షించారు. విద్యావంతుల చురుకైన భాగస్వామ్యం, బలమైన స్థానిక స్వపరిపాలనా సంస్థలు, చిత్తశుద్ధి, ముందుచూపు కలిగిన రాజకీయ నాయకత్వంతో పాటుగా అన్ని స్థాయిలలో బలోపేతం చేసిన ప్రజారోగ్య వ్యవస్థ కరోనా దాడి నుంచి కేరళ ప్రజలను కాపాడ గలిగాయి.

అంతర్జాతీయ అనుభవాలు, మనదేశంలోని కేరళ అనుభవం పరిశీలించినప్పుడు కరోనాపై పోరులో ప్రభుత్వ ఆసుపత్రులు, ప్రజారోగ్య వ్యవస్థలే ప్రజలకు అండగా నిలబడ్డాయని మనకు అర్థం అవుతుంది. ప్రజల ప్రాణాలకు ముప్పు వాటిల్లిన సందర్భాల్లో కూడా కార్పొరేట్ ఆసుపత్రులు లాభనష్టాల లెక్కలు వేసుకున్నాయి కానీ ప్రజలకు అండగా నిలబడ లేదు. ఇందులో అసహజమైనదిగానీ, ఆశ్చర్యపోవాల్సినదిగానీ ఏమీ లేదు! పెట్టుబడి కేవలం లాభాలను అన్వేషిస్తుందే తప్ప ప్రజా సంక్షేమాన్ని కాదు. పెట్టుబడి సేవలో తరించిపోతోన్న మన పాలకులు ఈ సంక్షోభం తర్వాతనైనా ప్రభుత్వ ఆరోగ్య వ్యవస్థల ప్రాధాన్యతని గుర్తిస్తారనుకోవడం అమాయకత్వమే. ప్రజల ఆరోగ్యానికీ, ప్రాణాలకు విలువనిచ్చేదీ అండగా నిలిచేది ప్రభుత్వ ఆధ్వర్యంలోని ప్రజారోగ్య వ్యవస్థలేనని కరోనా నేర్పిన పాఠాన్ని మర్చిపోకుండా మనమే ప్రభుత్వ ఆరోగ్య వ్యవస్థల బలోపేతం కోసం ఉద్యమించాలి.

✷

# కరోనా కష్టాల నివారణలో చేతులెత్తేసిన ప్రభుత్వం

ప్రజాస్వామ్యం, ప్రభుత్వాల డొల్లతనం నగ్నంగా బయటపడిన వైనం. మతం మనుషులను విడగొట్టి కొద్దిమంది ప్రయోజ నాలు కాపాడటానికి వాడుకునే ఒక సాధనం అని తేటతెల్లమయిన సందర్భం. పిల్లలు, పెద్దలు, వృద్ధులని తేడా లేకుండా వలస కార్మికులు తమ తమ ఊళ్లకు వేల మైళ్ళు నడిచిపోతున్నా పట్టించుకోని 56 అంగుళాల ఛాతీ వున్న అతి గొప్ప ప్రధాని వున్న దేశం. దేశ వ్యాప్తంగా రోడ్ల పక్కన, రైలు పట్టాల మీద కనబడుతున్న వలస కార్మికుల విషాద యాత్రలు కూడా ఈ ప్రభుత్వాలను కదిలించ లేదు. అయితే మనిషికి మనిషి అండగా నిలిచి మానవత్వాన్ని నిలబెట్టుకున్నాడు.



చప్పట్లు కొట్టండి, దీపాలు పెట్టండి అని చెప్పటానికి ఎన్నికలలో అత్యధిక మెజారిటీతో ఈ ప్రభుత్వాన్ని ఎన్నుకోలేదు ప్రజలు. తమ జీవితాలు బాగుపడతాయని ఎన్నుకున్నారు. జీవితాలు బాగుపడకపోగా ఇంకా ఇంకా కిందకి దిగజారుతున్నాయి. "ప్రతి ఒక్కరికీ ప్రయోజనం చేకూరుస్తాం, చతికిల బడ్డ ఆర్థిక రంగాన్ని పరుగులు పెట్టిస్తాం" అంటూ 20 లక్షల కోట్ల ప్యాకేజిని అందమైన డిజైన్లతో కూడిన మాస్క్ సాక్షిగా అట్టహాసంగా ప్రకటించారు ప్రధాని. ఇక నుంచి అంతా స్వదేశీ అనీ, ఆత్మ నిర్భయ్ అంటూ మంచి హావ భావాలతో ప్రజల హృదయాలను దోచుకునే నటనతో మెప్పించారు. రోజుకొక సారి టి వి లో కనబడిన ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ ఏ ఏ వర్గాలుకు లాభాల పంట పండుతుందో, ఆర్థిక వేత్తలకు కూడా అర్థం కాని భాషలో వల్లె వేసింది.

నిజంగా ప్రజలకు అంత భరోసా వస్తుందా? 20 లక్షల కోట్లు ఎవరి కోసం? ఎవరికి ఉపయోగపడతాయి? ఇంతక ముందు ఆర్ బి ఐ ప్రకటించిన ప్యాకేజీ, అంతకు ముందు ప్రభుత్వం ప్రకటించిన ప్యాకేజీ కూడా ఇందులోకే వస్తుంది కాబట్టి నికరంగా ప్రకటించింది పది లక్షల కోట్లు మాత్రమేనని ఆర్థిక వేత్తలు తేల్చారు. దీన్ని ప్రభుత్వం మాత్రం దాచిపెట్టి నాటకమాడింది. ముందరి రూ. 10 లక్షల కోట్లు ఎవరి ఖాతాలోకి చేరాయో చూస్తే మిగతా 10 లక్షల కోట్లు కూడా వారి ఖతా లోకే చేరతాయి అని సులభంగా అర్థం చేసుకోవచ్చు. సామాన్యులకు అర్దం కాని పదాలతో ఆర్థిక మంత్రి వివరించిన ప్యాకేజీ లో సామాన్యులకు కేటాయించింది ఏమీ లేదు. మధ్య తరగతి, అణగారిన వారికి ఇవ్వదలచిందీ సున్నా.

ప్రధాని చెప్పిన మరో అంశం స్వావలంబన – అంటే తన కాళ్ళ మీద తను నిలబడటం. భారతదేశం తన కాళ్ళమీద తాను నిలబడాలంటే ప్రభుత్వరంగం బలంగా వుండాలి. పెట్టుబడుల ఉపసంహరణ శాఖను ఏర్పాటు చేసిన బీజేపీ ప్రభుత్వం స్వావలంబ నను పాతాళానికి తొక్కేసింది. మేక్ ఇన్ ఇండియా పేరుతొ శ్రమను చౌకగా కాజేసే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అందులో భాగంగానే బీజేపీ పాలిత రాష్ట్రాలలో కార్మిక చట్టాలను చుట్టబెట్టి మచ్చుమీద వెయ్యటంతోపాటు 12 గంటల పని విధానం, ఓవర్ టైం పనికి వేతనం ఇవ్వకపోవటం లాంటి మార్పులు కార్మిక చట్టాలలో చేశారు. ఇది కార్మికులను శారీరకంగా, ఆర్థికంగా దోచుకోవటమే.

పరిశ్రమలను మరింతగా ప్రైవేటుకు అప్పగించాలి అని కూడా ప్రధాని తన ప్రసంగంలో చెప్పారు. ఇప్పటిదాకా బతికి బట్టగలిగిన వ్యవస్థల వల్లనే కరోనాని ఎదుర్కోగాలిగాం. రాత్రింబవళ్లూ కరోనా రోగుల కోసం కష్టపడిన ప్రభుత్వ రంగానికీ, ఏ మాత్రం జవాబుదారీతనం లేని ప్రైవేటు రంగానికీ వున్న తేడాని కరోనా చూపించింది. లాక్ డౌన్ పెట్టి నిరసనలు జరగకుండా చూసుకుని, కోవిడ్ 19 ప్యాకేజీ పేరుతో దానికి ఏమాత్రం సంబంధం లేని ఎజెండాను బయటికి తీసింది ప్రభుత్వం. బొగ్గు గనులు, ఆయుధ కర్మాగారాలు, అంతరిక్ష పరిశోధనలు ఇలా అన్ని రంగాలలో ప్రైవేటు సంస్థలకు ద్వారాలను బార్లా తెరిచింది.

ప్రజల దగ్గర డబ్బులుంటే కొనుగోలు శక్తి

పెరుగుతుంది. కొనుగోలు శక్తి పెరిగితే పరిశ్రమలు ఎక్కువ ఉత్పత్తి చేస్తాయి. ఎక్కువ ఉత్పత్తి చెయ్యాలంటే ఎక్కువమంది కార్మికులు కావాలి. కాబట్టి ఎక్కువ ఉద్యోగాలు వస్తాయి. ఎక్కువ మందికి ఉద్యోగాలు వుంటే కొనుగోలు శక్తి పెరుగుతుంది. ఇదీ వాస్తవ విషయం. సామాన్యులకు కూడా అర్థం అయ్యే ఈ విషయం ప్రభుత్వాలకు అర్థం కాకపోవటం ఆశ్చర్యం. చాలా దేశాలు వారి పౌరులకు ప్రతి నెలా నగదు రూపాన సాయం అందిస్తున్నాయి.

హాంగ్ కాంగ్ 10,000/- హాంగ్ కాంగ్ డాలర్లు, అమెరికా 1000/- డాలర్లు, నెదర్లాండ్ – 90 శాతం జీతం, డెన్మార్క్ 75 శాతం నుంచి 90 శాతం జీతం సాయాలను అందించాయి.

కానీ భారతదేశంలో మాత్రం కూలీలను రోడ్ల మీద, రైల్వే ట్రాక్‌ల మీద వదిలేశారు. ప్రభుత్వం కనీసం అట్టడుగు 30 శాతం మంది ప్రజలకైనా నెలకు 10 వేల చొప్పునయినా ఇవ్వకపోతే నగదు చేతులు మారక, ఆర్థిక వ్యవస్థ కుప్పకూలుతుందని ఆర్థిక వేత్తలు అంటున్నారు. కానీ పెద్దలకు దోచి పెట్టటంలో మునిగిపోయివున్న ప్రభుత్వం ఈ మాటను చెవిన పెట్టటం లేదు.

రూ. 20 లక్షల కోట్లలో విద్యకు కేటాయింపులు లేవు. వైద్యానికి లేవు. రైతులకు లేవు. కార్మికులకు లేవు. వుద్యోగాల కల్పన లేదు. ఆర్థిక రంగం కుదేలయింది. లాక్ డౌన్ విధించిన రెండు వారాలలో 119 మిలియన్ (మిలియన్ అంటే పది లక్షలు) ప్రజలు వుపాధి కోల్పోయారు. ఇందులో సగం కుటుంబాలకు వారి వేతనాలే ఆధారం. దీనివల్ల 30 కోట్ల ప్రజల జీవితాలు ప్రమాదంలో పడ్డాయి. వారికీ, వారి కుటుంబాలకూ ఎలా భరోసా ఇస్తారో ఎవరూ చెప్పటంలేదు. ఈ లాక్ డౌన్ కారణంగా చరిత్రలోనే అతి పెద్ద నిరుద్యోగ సైన్యాన్ని సృష్టించబడుతుంది. కుటుంబాలు సంక్షోభంలో పడతాయి. ప్రపంచంలో ఏ దేశానికీ లేనంత యువత వున్న భారతదేశం వారి శక్తిని సరైన రీతిలో వాడుకోవటం చేతకాక నిర్వీర్యం చేస్తున్నది. ✷

---

# నౌకాదళంలో నారీ శక్తికి పట్టం సర్వోన్నత న్యాయస్థానం జోక్యంతో సాకారం



**భా**రత నారీ శక్తికి పట్టం కడుతూ సర్వోన్నత న్యాయస్థానం కీలకమైన తీర్పు వెలువరిచింది. నౌకాదళంలో మహిళాధికారులకు శాశ్వతమైన కమిషన్ ఇచ్చేందుకు మార్గం సుగమం చేసింది. చరిత్రలో మహిళలకు జరిగిన వివక్ష అధిగమించడానికి వారికి సమాన అవకాశాలు కల్పించాలని పేర్కొంది. మహిళలకు న్యాయపరంగా అందాల్సిన వాటనీ, సమాన హక్కులనూ నిరాకరించిన సంఘటనలు చాలా వున్నాయని పేర్కొంది. ఈ శాశ్వత కమిషన్ మంజూరు చేయడానికి సర్వన్నోత న్యాయస్థానం కేంద్ర ప్రభుత్వానికి మూడు నెలల సమయం ఇచ్చింది. మహిళాధికారులకు సైన్యంలో శాశ్వత కమిషన్ కల్పించడానికి సర్వోన్నత న్యాయస్థానం మార్చిలోనే తీర్పు చెప్పింది. ఇప్పుడు నౌకాదళంలో కూడా మహిళలకు శాశ్వత స్థానం కల్పించింది. సైనిక దళాలలో సమానావకాశాల నిరాకరణకు కారణం మహిళల శరీర నిర్మాణం, మాతృత్వం లాంటి అంశాలను అడ్డం పెట్టి చూపుతున్నారు. కానీ అది సరికాదనీ, రాజ్యాంగ పరంగా వారికి అందాల్సిన గౌరవాలు దక్కకుండా చేయడానికి ఏవో- సాకులు చెప్పొద్దనీ సర్వోన్నత న్యాయస్థానం తేల్చి చెప్పింది. నౌకాదళంలో సముద్రంలో విధులకు వెళ్తే తిరిగి రావడానికి సమయం పడుతుందనీ అందువల్ల మహిళలకు అటువంటి విధులు సరిపడవనీ కేంద్రం చేసిన వాదనను సర్వోన్నత న్యాయస్థానం తోసిపుచ్చింది. పురుషులతో సమానంగా స్త్రీలు కూడా సాగరయానం చేయగలరని చెప్పింది. నౌకాదళంలో విజయాలు సాధించిన మహిళాధికారులను సుప్రీంకోర్టు ప్రస్తావించింది! ✷

# తొలిరాత్రి హక్కు



నాయకులను ప్రముఖ కుటుంబాల నుంచి మాత్రమే ఎన్నుకున్నా, పితృస్వామ్యం మాత్రం వారసత్వ విధానం వైపే మొగ్గు చూపి, కులీన కుటుంబాల పరిపాలనగానూ, తరువాత రాచరికంగానూ రూపుదిద్దుకుంది. గ్రీస్, రోమ్‌లలో వలే జర్మన్ గణాల సొంత ఆస్తి, పరిశ్రమలు, వ్యాపారాలు కూడా విదేశీయులతో చేసుకున్న వివాహాల కారణంగా నశించిపోయాయి. గణాల స్థానాన్ని మార్క్‌లు ఆక్రమించాయి. కుటుంబ పెద్దలే మార్క్ సంఘంలో ప్రతినిధులుగా వుండేవారు. భార్య, కుమార్తెలు, కోడళ్లకు ఈ సంఘాలలో స్థానం లేదు. తెగల వ్యవహారాలను స్త్రీలే నిర్వహించే కాలం దాటిపోయింది. 5వ శతాబ్దం లోనే సాలిక్ చట్టం తండ్రి ఆస్తికి స్త్రీల వారసత్వ హక్కును కొట్టి వేసింది. ఈ కాలంలో కూతురు పుడితే తల్లితండ్రులకు ఒక బండి కలప, కొడుకు పుడితే రెండు బండ్ల కలప ఇచ్చేవారు. అంటే స్త్రీ విలువ పురుషుడి విలువలో సగమేనని మార్క్ సంఘాలు నిర్వచించాయి. యుద్ధంలో గెలిచిన సైనికాధికారులు విశాలమైన భూ భాగాలను సొంతం చేసుకునేవారు. ఉమ్మడి ఆస్తిపై తమకు అధికారం వుందనే వారు. కాలక్రమంలో రైతుల భూములన్నీ కౌలు భూములుగా మారిపోయాయి. రైతులు కౌలు, పన్ను కడుతూ కౌలు రైతులయ్యారు. భూస్వామ్య వ్యవస్థ బలం పుంజుకుంది. సామాన్యుల పరిస్థితి దిగజారిపోయింది. ఈ విధంగా రైతులు తమ స్వేచ్ఛను పోగొట్టు కున్నారు. భూస్వాములకు తమ బానిస రైతులపై అంతులేని అధికారం ఉండేది. పెళ్ళిళ్లను కూడా వారే నిర్ణయించేవారు. 18 ఏళ్ల అబ్బాయికీ, 14 ఏళ్ల అమ్మాయికీ బలవంతంగా పెళ్ళి చేసేవారు. వితంతువుల, విదురుల విషయంలో కూడా ఇలాగే జరిగేది. ఈ భూస్వాములకు తమ ఆడ బానిసలతో లైంగిక సంబంధాలు పెట్టుకునే అధికారం కూడా ఉండేది. పని వాళ్లు తొలి రాత్రి భూస్వాములకు 'పడక కానుక, కన్య కానుక' పన్నులు కట్టేవారు. ఈ తొలి రాత్రి హక్కు మూలాలు మాతృస్వామ్యంలోనే భర్తలకు వుండేవి. తరువాత ఈ హక్కు నాయకులకూ, మత పెద్దలకూ పరిమితమైంది. ఆ తరువాత ఈ హక్కు ప్రజల మీద అధికారం ఉన్న భూస్వాములకు బదిలీ అయింది. ఈ తొలి రాత్రి హక్కు భూస్వాములకు ఇవ్వడానికి కారణం – పనివాళ్లు పెళ్ళి చేసుకోవాలంటే అతని అనుమతి తీసుకోవలసి రావటమే. ఈ ఆచారం ప్రకారం తొలి రాత్రి హక్కు పాటించిన తల్లులకు పుట్టిన తొలి సంతానాన్ని ఉమ్మడి ఆస్తిగా పరిగణించేవారు. తరువాత కాలంలో పన్నులు కట్టి చాలా మంది ఈ ఆచారం నుంచి తప్పించుకున్నారు. జర్మన్‌లో ఈ ఆచారం చాలా ఎక్కువ కాలం కొనసాగింది. స్కాట్లండులో, వేల్స్‌లో ఈ హక్కు మధ్యయుగాల్లో కూడా ఉండేది. ఈ ప్రాంతాలలో జాతి సంఘాలు కొనసాగటం వల్ల భూస్వామి లేదా అతని ప్రతినిధి కాకుండా తెగ నాయకుడు తనకు కానుకలు ఇవ్వని పరిస్థితిలో అందరి భర్తలకు ప్రతినిధిగా హక్కు ఉపయోగించుకునేవాడు. ఈ హక్కు ఆధునిక యుగం మొదలయ్యేవరకూ, భూస్వామ్య వ్యవస్థ చట్టాల్లో ఉండేది. పోలెండులో ఉన్నత వర్గాల పురుషులు తమకి నచ్చిన ఏ స్త్రీ నైనా పొందటం తమ హక్కుగా భావించేవారు. ఎదురించిన వారిని 100 బెత్తం దెబ్బలు కొట్టేవారు. జర్మనీలోనే కాక ఆగ్నేయ ఐరోపాలో ఇప్పటికీ తమ కింద పనిచేసే వుద్యోగులు తమ కామానికి కన్యత్వాన్ని బలిపెట్టడం సర్వ సాధారణంగా భూస్వాములు భావిస్తారు. భూస్వామ్య వ్యవస్థలో పని వాళ్లకు పెళ్ళిళ్ళు అవడం యజమానికి లాభం. ఎందుకంటే వారికి పుట్టే పిల్లలు పెరిగి ఆ యజమానికే పనులు చేయాలి. అందుకని యజమానులూ, మతాధికారులూ తమ పాలితులను పెళ్లికి ప్రోత్సాహించేవారు. 16వ శతాబ్దంలో మత పెద్దల బలవంతపు బ్రహ్మచర్యం వ్యభిచారానికి దారితీసింది. పోప్‌లకు నివాసమైన రోమ్ క్రైస్తవ రాజధానిగా మాత్రమే కాక క్రైస్తవేతర చక్రవర్తుల సంప్రదాయానికి కూడా తగినట్లుగా మారి ఐరోపాలో అనైతికతకు నెలవయింది. రోమన్ సామ్రాజ్యం కూలిపోయి తన అవలక్షణాలన్నీ క్రైస్తవ ఐరోపాకు పంచింది. అసంఖ్యాకమైన మత పెద్దలు సోమరులై, విలాసవంతమైన జీవితం గడుపుతూ, లైంగిక వాంఛలు తీర్చుకుంటుండేవారు. వాళ్ల చట్ట వ్యతిరేక, అసహజ లైంగిక కోరికలు స్త్రీలకు బెడదగా మారాయి. క్రైస్తవ మతానికీ – వ్యభిచార గృహాలకు తేడా లేనంతగా విచ్చలవిడిగా విచక్షణ రహితంగా నేరాలు పెరిగాయి. రైతులు తమ భార్యలనూ, కుమార్తెలనూ మత పెద్దల నుంచి కాపాడుకోవడానికి ఉంపుడు గత్తెలు లేని వ్యక్తిని ఫాస్టరుగా ఉంచేందుకు తీవ్రంగా ప్రయత్నించేవారు. ✷

# వసుధైక కుటుంబం




**అమ్మా, ఆశ!**

గత రెండు మాసాలుగా నాకు కొంచెం అనారోగ్యం కారణంగా వెసులుబాటు లేక నీకు ఉత్తరాలు రాయలేకపోయాను. నీవు కిందటి ఉత్తరంలో దేశ పరిస్థితులు చాలా ఆందోళన కలిగిస్తున్నాయని రాశావు. నీకే కాదు మా అందరిదీ అదే అభిప్రాయం.

దేశంలో నిరుద్యోగం ప్రబలిపోయింది. నిరుత్సాహానికీ, నిర్లిప్తతకూ యువత గురవుతున్నారు. అంతే కాదు ఆర్థిక పరిస్థితి కూడ గడ్డుగానే వుంది. కానీ ప్రభుత్వం చెప్పే కబుర్లు, అంకెల గారడీలు వింతగొలుపు తున్నాయి. కార్పొరేట్ రంగ సంస్థలకూ, పెట్టుబడిదారులకూ ప్రభుత్వం ఎప్పుడూ అండగానే వుంటున్నది. అయితే తమది బడుగు జీవుల, బలహీన వర్గాల ప్రభుత్వముని మాత్రం చెబుతూ వుంటారు. దేశం నిండా ఇన్ని సమస్యలు వుండగా ఇప్పుడేదో మునిగి పోయినట్లు సీఏఏ, ఎన్నార్సీ, ఎన్పీయార్ చట్టాలను ఆగమేఘాల మీద కేంద్ర ప్రభుత్వం తేవలసిన అవసరమే లేదు. వీటి గురించి ఈ పాటికే మీరు కొంత తెలుసుకొని వుంటారు. దేశంలో వున్న సమస్యల నుంచి ప్రజల దృష్టిని మరల్చాలనీ, తమకున్న ఆధిక్యతను అనుకూలమైన అంశాలకు మాత్రమే ఉపయోగించుకోవాలనే ఓ సంకుచిత ధోరణి బాగా కనపడుతోంది.

మనదేశం హిందూ, మహ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైన, పార్శీ తదితర పదుల సంఖ్యలో మతాలకు నిలయం. బహుళ మతాలకు ఆలవాలమైన ఈ దేశంలో పౌరసత్వమనేది మతప్రసక్తి లేని అంశంగా రాజ్యాంగం చెబుతున్నది. కానీ దురదృష్టవశాత్తూ పౌరసత్వ అర్హతకూ, మతానికీ ముడి పెట్టడమన్నది ఎంతవరకూ సమంజసం? అది మన రాజ్యాంగ స్ఫూర్తికే వ్యతిరేకం. ఇన్ని మతాలు ఇక్కడ కొలువై వుండటం వల్లనే మన రాజ్యాంగానికి రూపకల్పన చేసిన పెద్దలు ఈ దేశాన్ని లౌకిక దేశంగా ప్రకటించారు. అయినా కొన్ని రాజకీయ శక్తులు ఈ దేశాన్ని హిందుత్వ రాజ్యాంగంగా ప్రకటించి, అట్లాగే తయారు చేయాలని ఉవ్విళ్ళూరుతున్నారు. ఈ క్రమంలో ఒక మతస్థులు వేరొక మతస్థులను అనుమానంగా చూడటం, పగ, ద్వేషం పెంచుకోటం పెచ్చు మీరుతున్నాయి.

ప్రభుత్వ నిర్ణయాన్ని ప్రతిపక్ష పార్టీలు వ్యతిరేకిస్తే వారిని దేశద్రోహులుగా ముద్ర వేసేందుకు వెనకాడటం లేదు. ఇదొక రకమైన దాడి. ప్రజల సానుభూతిని పొందేందుకు అధికారపక్షం వేసే ఓ ఎత్తుగడ.

చిట్ట చివరికి తామే దేశభక్తులమని ప్రకటించుకోటానికి ఏరకమైన చర్యలకు దిగేందుకయినా వారు వెనకాడరు. నిస్వార్థంగా తన సర్వస్వాన్ని దేశానికి అంకితం చేసి, అతి సామాన్యమైన జీవితాన్ని గడిపి, ప్రపంచ ప్రజల్నే ఆశ్చర్యపరచిన గాంధీజీని కూడా కించపరచటం, ఎద్దేవా చేయటం వరకూ వెళ్ళింది. ఏ పార్టీ అధికారంలో వుంటే ఆ పార్టీ నాయకుల మెప్పు పొందాలనే తాపత్రయంతో నాయకులు ఇలాంటి చౌకబారు వ్యాఖ్యానాలు చేయడం పైనుంచీ అంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ పరిధుల్లోనూ వింటున్నాము. దేశ దేశాలకూ అనుసర ణీయమైన గాంధీ మార్గం, అహింస, సత్యా గ్రహదీక్షలు, నేడు మనదేశం లోనే పరిహాసానికీ, గేలికీ గురవుతున్నాయి. పైగా ఇవి తమని తాము హిందుత్వ పార్టీలుగా కూడా ప్రకటించుకొంటున్నాయి. ఏదేమైనా తమ స్వప్రయోజనా కోసం ఒక అహింసామూర్తిని ఇష్టమొచ్చినట్లు మాట్లాడటం క్షమించరాని నేరం.

ప్రజలు ఒక పార్టీని అత్యధిక మెజార్టీతో గెలిపించారంటే అర్థం, ఆపార్టీ పట్ల విశ్వాసం, తమ భవిష్యత్తుకు బంగారు బాటవేస్తారనే భరోసాతోనే! తమ కేదో ఆసరా చూపెడతారన్న ఆశతోనే... అయితే ఓట్లు దండుకొనేందుకు ఇచ్చే హామీలు వాగ్దానాలు, తీపి మాటలు – అధికారం చేజిక్కించుకొన్న మరునాడే మరచి పోతున్నారు. తమ ఇష్టారాజ్యంగా తాము అనుకొన్నట్లు నిర్ణయాలు తీసుకోటం తప్ప, ప్రజల భాగస్వామ్యం – ప్రజాస్వామ్యం అనే పదాలకు అర్థం లేకుండా పోతున్నది.

మనదేశం హిందూ, మహ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైన, పార్శీ తదితర పదుల సంఖ్యలో మతాలకు నిలయం. బహుళ మతాలకు ఆలవాలమైన ఈ దేశంలో పౌరసత్వమనేది మతప్రసక్తి లేని అంశంగా రాజ్యాంగం చెబుతున్నది. కానీ దురదృష్టవశాత్తూ పౌరసత్వ అర్హతకూ, మతానికీ ముడి పెట్టడమన్నది ఎంతవరకూ సమంజసం? అది మన రాజ్యాంగ స్ఫూర్తికే వ్యతిరేకం. ఇన్ని మతాలు ఇక్కడ కొలువై వుండటం వల్లనే మన రాజ్యాంగానికి రూపకల్పన చేసిన పెద్దలు ఈ దేశాన్ని లౌకిక దేశంగా ప్రకటించారు. అయినా కొన్ని రాజకీయ శక్తులు ఈ దేశాన్ని హిందుత్వ రాజ్యాంగంగా ప్రకటించి, అట్లాగే తయారు చేయాలని ఉవ్విళ్ళూరుతున్నారు.

అయినప్పటికీ యువత అధైర్యపడ కూడదు. భవిష్యత్తు తమదే అనే నమ్మకంతో అడుగులు వెయ్యాలి. మహాకవి శ్రీశ్రీ చెప్పినట్లు – ఎవరో వస్తారని, ఏదో చేస్తారని ఎదురు చూడకూడదు. అన్యాయాలకు తల వంచకూడదు. ఎంతటి అధికారంలో వున్న వారైనా తప్పుడు నిర్ణయాలు తీసుకొన్నప్పుడు ప్రశ్నించే అధికారం ఈ దేశ పౌరులుగా ఎవరికైనా వుంది. అన్యాయాలను కళ్ళప్పగించి చూస్తూ కూర్చుంటే జరగబోయే నష్టంలో మీ యువతరమే ఎక్కువ భాగం పంచుకోవాల్సి వస్తుంది.

ప్రస్తుతం దేశంలో ఈ సీఏఏ వగయిరా మీద ముస్లిములు ఒక్కరే కాదు, సమానత్వాన్ని కోరుకొనే ప్రతి వారూ వుద్యమిస్తున్నారు. ఈ కొత్త చట్టం వల్ల మన దేశ ప్రతిష్ట అంతర్జాతీయంగా దెబ్బతింటున్నది. మనది ఒక పాకిస్థాన్, ఆఫ్ఘనిస్థాన్ లాగానో మత రాజ్యం కాకూడదనేదే మన ఆకాంక్ష.

చైనాలో ఉన్న బహుళ జాతి కంపెనీలు తమ యూనిట్లను భారత్ కు తరలిస్తాయని పెద్దగా ఆశలు పెట్టుకోవద్దు.

ప్రజల కొనుగోలు శక్తి పెద్దగా లేకపోవడమే భారత్ ఎదుర్కొంటున్న అతి పెద్ద సమస్య కరోనా దెబ్బతో ప్రజల కొనుగోలు శక్తితో పాటు డిమాండ్ కూడా పడిపోయిందన్నారు.

ఆరు నెలల పాటు పేదల చేతికి మరింత నగదు అందేలా చూడాలి



నోబెల్ ప్రైజ్ విజేత
అభిజిత్ బెనర్జీ



### మత రాజ్యం కాకూడదు

దేశ ప్రజలందరికీ కావలసింది. కూడు, గుడ్డ–నీడ, ప్రశాంతమయిన జీవితం. వీటిని ఏ ప్రభుత్వమూ సమృద్ధిగా సమకూర్చలేక పోయింది. ప్రాథమికా వసరాలైన విద్య, వైద్యం వంటివి సామాన్యులకు అందుబాటులో లేకుండా పోయాయి. ఇంకా గిరిజన ప్రాంతాల్లో సరైన ఆసుపత్రులే లేవు. ప్రసవ వేదన పడుతున్న స్త్రీలను ఇప్పటికీ కి.మీ. మేర డోలీలో మోసుకపోతున్నారంటే 72 ఏళ్ళ స్వాతంత్ర్యం చిన్నబోయినట్లే! ఇటువంటి వాటి మీద దృష్టి పెట్టకుండా రామాలయాలు కడతామనీ, చర్చిలు కడతామనీ అడిగినా అడగకపోయినా రకరకాల ఎన్నికల నజరానాలు ఇస్తామని నాయకులు ఎన్నికల కాలంలో పోటీ పడుతున్నారు. ఇదే ధోరణిలో అధినేతలున్నట్లయితే దేశం ఇంకా వెనక్కు వెళ్ళటం ఖాయం. ప్రజలకు పని కల్పించగలగాలి కానీ సోమరిపోతులుగా మాత్రం తయారు చేయకూడదు.

అమ్మా ! ఆశా, మనం ఎప్పటికీ మానవులుగా మిగిలి పోవాలి, కానీ మతస్థులుగా కాదు. మత ప్రాతిపదికన పౌరసత్వ నిరూపణ, భారతీయత, హిందుత్వ పోకడలను చూపెట్టడం దేశ ఐకమత్యానికి భంగం వాటిల్లుతుంది, మనుషులెక్కడ వున్నా మనుషులే! ఈ సరిహద్దులు దేశాల మధ్య వుండటం అవసమేమోకానీ మనుషుల మధ్యకాదు. మన ప్రాచీనుల ధోరణిలో కూడా 'వసుధైక కుటుంబమ'నే ఒక ఉదార భావం వుండేది. అదే నేడు కావల్సింది.

ఈ విషయాలన్నింటినీ నీవు చక్కగా ఆకళింపు చేసుకొని, నీ మిత్రులతోనూ చర్చించు. పరీక్షల సమయం వచ్చింది కదూ, బాగా చదువుకోరా ! ఉంటాను తల్లీ !

ప్రేమతో,
అమ్మమ్మ

డి. రమాదేవి

# చైతన్యంతోనే హిజ్రాలకు సామాజిక సమానత్వం



**మేమూ మనుషులమే !**

ఇలా పుట్టడం మేము చేసిన తప్పా? మా తల్లిదండ్రులు చేసిన తప్పా? తప్పుచేసినవారిని మాతో పోల్చి 'కొజ్జా' అంటూ తిట్టటం మమ్మలను తీవ్రంగా బాధిస్తోంది.

బతకడానికి ఎవ్వరూ ఏ పనీ ఇవ్వనప్పుడు ఏమి చేయాలి? ఏమి చేయగలం? మా నేరం లేకుండానే ఎందుకు వెలి వేస్తున్నారు ! "సిగ్గు లేదు", "బరి తెగించారు" - అంటూ అపవాదులు వేస్తున్నారు. మా శరీర పుట్టుక వేరు. మా రూపం వేరు. మా లోపల ఆలోచనలూ, మా ప్రవర్తనా వేరు. ఈ పరిస్థితి ఎందుకు వచ్చిందో తెలియక తల్లడిల్లి పోతాము. తల్లిదండ్రులకు చెప్పలేము. వాస్తవానికి తల్లిదండ్రులు కూడా ఆదరించరు. అసహ్యించుకుంటారు. "ఆడంగి వెదవ", "కొజ్జా" అని తల్లిదండ్రులే అంటుంటే, బతకడం ఎందుకన్న నిరాశ ఆవరిస్తుంది.

ఇలాంటి వివక్షను కుటుంబ సభ్యుల నుంచీ, సమాజం నుంచీ ఎదుర్కొంటున్న హిజ్రాలు (ట్రాన్స్జెండర్లు) - వారి బాధలు ఎవరికి చెప్పుకోవాలో? తెలీదు. కసి, స్వేచ్ఛ కోసం ఆరాటం, విశృంఖలత వారి జీవితాలను నడిపిస్తాయి. అవమానాలు, అనుభవించిన వేదన హిజ్రాలందర్నీ ఒకచోట చేరుస్తున్నది. "మాకు ఒక ఆడపిల్ల, ఒక మగ పిల్లవాడు" అని చెప్పుకున్నట్లు "ఒక హిజ్రా" అని కూడా తల్లిదండ్రులు చెప్పుకునే రోజు రావాలని వాళ్లు కోరుకుంటున్నారు.

2014 ఏప్రిల్‌లో సుప్రీంకోర్టు తీర్పుతో ఓ చట్టం చేసేందుకు కేంద్ర ప్రభుత్వం పూనుకుంది. 2019లో కేంద్ర ప్రభుత్వం హిజ్రాల కోసం రక్షణ చట్టం చేసింది. అయితే ఆ చట్టం మీద అనేక అభ్యంతరాలు వ్యక్తమయ్యాయి. తమిళనాడు ప్రభుత్వం దేశంలోనే మొదటిసారిగా హిజ్రాలకు సంక్షేమ సంస్థను ఏర్పాటు చేసింది. కేరళలో హిజ్రాల సమస్యలపై ప్రభుత్వం సంపూర్ణమైన పరిశీలన నిర్వహించింది.

అనేకమంది చదువుకున్న హిజ్రాలు, చైతన్యవంతమైన వారు- వారి హక్కుల కోసం, మనుగడ కోసం, గౌరవనీయమైన జీవితం కోసం చేసిన, చేస్తోన్న పోరాటాల ఫలితంగానే కోర్టు తీర్పులు అనుకూలంగానూ, ప్రభుత్వ చట్టాలూ వచ్చాయి. సమాజంలో కొన్ని సానుకూల చర్చలు ప్రారంభమయ్యాయి.

ఈ క్రమంలోనే విజయవాడ కేంద్రంగా పనిచేస్తున్న 'సమన్విత' కథల పోటీని నిర్వహించింది. మంచి కథలు రాయడానికి అవకాశం కల్పించింది. ఈ కథలు హిజ్రల సమస్యలపై సమాజంలో కొంత అవగాహన కలగడానికి వుపయోగపడతాయి. హిజ్రాల ఎడల చులకన భావాన్ని పోగొట్టేందుకు కూడా దోహదపడతాయి.

సమాజంలో అనాదిగా హిజ్రాల చరిత్రని మనం చదివాము. బృహన్నల, శిఖండి గౌరవనీయమైన పాత్రలే. సమర్ధతకూ, నైపుణ్యానికీ నిదర్శనమే. వారిని అర్ధనారీశ్వర స్వరూపులుగా సమాజం భావిస్తోంది. వారి దీవెనలు కోసం ఎదురుచూసే సంప్రదాయాలు ఇప్పటికీ చాలా చోట్ల ఉన్నాయి. కానీ ఆధునిక సమాజంలో మాత్రం చిన్న చూపు - ఇది మారాలి. మార్పు కోసం హిజ్రాలు చేస్తున్న పోరాటానికి అనేకమంది అభ్యుదయ కాముకులు మద్దతిస్తున్నారు. 2014లో కాంగ్రెస్, సిపిఎం తమ ఎన్నికల ప్రణాళికల్లో హిజ్రాల సమస్యలను చేర్చాయి.

దేశవ్యాప్తంగా 2011 జనాభా లెక్కల ప్రకారం నాలుగు లక్షల 30 వేల మంది హిజ్రాలు ఉండగా మన ఉమ్మడి రాష్ట్రంలో నలభై మూడు వేల మంది హిజ్రాలు వున్నారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం తర్వాత అత్యధికంగా హిజ్రాలు వున్న ప్రాంతాలు తెలుగు రాష్ట్రాలు. అయితే తెలుగు రాష్ట్రాల

పాలకులు ఇంకా వారి సమస్యల పరిష్కారానికి సరైన దృష్టి సారించలేదు.

ఇదే సమయంలో రేవతి తమిళంలో రాసిన పుస్తకాన్ని ప్రముఖ రచయిత్రి సత్యవతి 'ఒక హిజ్రా కథ' పేరుతో అనువాదం చేశారు. ఆ పుస్తకానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు రావడం కూడా హిజ్రాల సమస్యలపై ఆలోచనలకూ, కార్యాచరణకూ కొంతమేర వుపయోగపడవచ్చు. హిజ్రాలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి ఈ ఆత్మకథ అత్యద్భుతంగా ఆవిష్కరించింది.

కేరళలో హిజ్రాల గురించి నిర్వహించిన సమగ్ర పరిశీలనలో పలు విషయాలు వెల్లడయ్యాయి. పాఠశాలల్లో వారు ఎదుర్కొంటున్న వేధింపుల కారణంగా, అవమానాల కారణంగా ఆ వయసులో వచ్చే మార్పులు ఏమిటో? తెలియక పాఠశాల మానివేస్తున్నారు. అందువలన వారికి చదువుకునే వాతావరణం కల్పించి, నూరు శాతం అక్షరాస్యులను చేసేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. కేరళలో 3619 మంది వివరాలను ఈ పరిశీలనలో సేకరించారు. అందులో 96 శాతం మంది 45 సంవత్సరాల లోపు వాళ్ళు. 99 శాతం మంది పురుషులుగా పుట్టి హిజ్రాలుగా మారారు. అన్ని మతాలు, కులాలకు చెందినవారు హిజ్రాలలో ఉన్నారు. 58 శాతం మంది పదో తరగతి పూర్తి చేయకుండానే బడిని వదిలేశారు. 11.6 శాతం మంది మాత్రమే ఏదో ఒక పని లేదా ఉద్యోగంలో ఉన్నారు. సమాజంలో తమ బిడ్డలు అందరిలా లేరనీ, వారి ప్రవర్తన భిన్నంగా ఉండటానికి జన్య కారణాలున్నాయనీ గుర్తించగలిగే చైతన్యం తల్లిదండ్రులలో లేదు. 81 శాతం మందికి ఏ విధమైన కుటుంబ, సామాజిక మద్దతు లేదు. 82 శాతం మందికి ఆర్థిక సహకారం ఎక్కడ నుంచీ, ఎవరి నుంచీ

> **బతకడానికి ఎవ్వరూ? ఏ పనీ ఇవ్వనప్పుడు ఏమి చేయాలి? ఏమి చేయగలం? మా నేరం లేకుండానే ఎందుకు వెలి వేస్తున్నారు ! "సిగ్గు లేదు", "బరి తెగించారు"- అంటూ అపవాదులు వేస్తున్నారు. మా శరీర పుట్టుక వేరు. మా రూపం వేరు. మా లోపల ఆలోచనలూ, మా ప్రవర్తనా వేరు. ఈ పరిస్థితి ఎందుకు వచ్చిందో తెలియక తల్లడిల్లి పోతాము. తల్లిదండ్రులకు చెప్పలేము. వాస్తవానికి తల్లిదండ్రులు కూడా ఆదరించరు. అసహ్యించుకుంటారు. "ఆడంగి వెదవ", "కొజ్జా" అని తల్లిదండ్రులే అంటుంటే, బతకడం ఎందుకన్న నిరాశ ఆవరిస్తుంది.**

లేదు. వారందరూ సెక్స్ మార్పిడి జరగాలని కోరుకుంటున్నారు. కానీ 9 శాతం మంది మాత్రమే శస్త్రచికిత్సలు చేయించుకోగలిగారు. వీరికి కుటుంబ ఆస్తిని కూడా పంచి ఇవ్వటం లేదు. అందువలన తాము పనికిరాని మనుషులమనీ, చచ్చిపోతే బాగుండనన్న న్యూనతకు తరచూ గురవుతుంటారట. పోలీసులకు మామూళ్లు ఇవ్వలేకపోతే – ప్రయాణికులను కొట్టారనీ, దొంగతనం చేశారనీ తప్పుడు కేసులు పెడుతున్నారు.హిజ్రాలు అదనపు అద్దె చెల్లిస్తేనే ఇంటిని వారికి అద్దెకు ఇస్తున్నారు. ఆసుపత్రికి వెళ్తే ప్రత్యేక ఫీజులు కట్టుకోవాల్సి వస్తోంది. వున్నత పట్టభద్రులయిన హిజ్రాలకు కూడా ఉద్యోగాలు ఇవ్వడానికి యాజమాన్యాలు నిరాకరిస్తున్నాయి. ఉద్యోగం లేక, కుటుంబ అండ లేక, సమాజం ఏ పనీ చేయనివ్వక ఎలా బతకాలి? జీవనమే పెద్ద ప్రశ్న! గత్యంతరం లేని స్థితిలో యాచనకు పూనుకుంటున్నారు. మరో వైపు లైంగిక హింసతో అనివార్యంగా దానినే వృత్తిగా మార్చుకుని బతుకుతున్నారు. ఈ దుస్థితి పోవాలని ఇప్పుడు కొందరు తిరుగుబాటు చేస్తున్నారు. హిజ్రాలుగా గుర్తింపు ఇవ్వాలని కోరుతున్నారు. స్త్రీ పురుషుల మాదిరిగానే అన్ని హక్కులూ కావాలంటున్నారు.

చదువులో, ఉద్యోగాల్లో తమకు రిజర్వేషన్లు కావాలనీ, ఉపాధి అవకాశాలను కల్పించాలనీ కోరుతున్నారు.

**వెలి – ఎంతో భయంకరం!**

సమాజం వెలి వేసిన ఫలితంగా ప్రత్యేక సమూహాలుగా జీవించడం, ప్రత్యేక సంస్కృతి హిజ్రాలకు అలవడింది. ఈ సంస్కృతిని చట్టం గుర్తించాలి. హిజ్రాలుగా మారిన, మారుతున్న వారు ఇల్లు వదిలేసిన వారినీ, ఇంటి నుంచి పెద్దలు నెట్టేసిన వారినీ అక్కున చేర్చుకుని బతుకు మీద ఆశనూ, రక్షణనూ, నీడనూ కల్పించడం ప్రభుత్వ బాధ్యత. బతుకు కోసం, హక్కులకోసం పోరాడే చైతన్యం ఇటీవల కొద్దిగా వారిలోనూ ప్రారంభమైంది. కోర్టుల తలుపు తట్టి కొన్ని హక్కులు పొందగలిగారు. శారీరక పరీక్ష ద్వారా మాత్రమే గుర్తింపు కార్డులు ఇవ్వాలన్న రాష్ట్ర ప్రభుత్వ వుత్తర్వును రద్దు చేయించుకో గలిగారు. ఈ మార్పులు సమూలంగా జరగాలి. వారికి చదువు, ఉపాధి, పింఛన్లు, నివాసం తదితర సదుపాయాలు సమకూర్చడం ప్రభుత్వ విధి కావాలి. అందుకు అవసరమైన చట్టాలను చేయాలి.

ఆ మార్పులను సమాజం దృష్టికి తీసుకు వచ్చే ఉద్దేశంతో సమన్విత, ఐద్వాతో పాటు కలిసి అడుగులు వేసేందుకుగాను కార్యాచణను రూపొందించాయి. 'అస్మిత' పేరుతో కథల పుస్తకాన్ని ప్రచురించాలని భావించాయి. కరోనా మహమ్మారి మూలంగా ఆవిష్కరణ ఆలస్యంగా జూన్ 25న జరగనున్నది. హిజ్రాల సమస్యల పరిష్కారానికి కలిసి అడుగులు వేద్దాం.

✷

# మాస్కు కన్నా... శుభ్రత మిన్న...!





డాక్టర్ యం.వి.రమణయ్య
ప్రజారోగ్య వేదిక రాష్ట్ర అధ్యక్షులు
9490300431

పత్రికలు, టీవీలు, ఫేస్‌బుక్, వాట్సాప్ లలో ఇప్పుడు తారాస్థాయిలో చర్చ జరుగుతున్న అంశం 'కరోనా'.

ప్రస్తుతం ప్రతి నోటా వినిపిస్తున్న మాటా 'కరోనా'. కరోనా దెబ్బకి ప్రపంచమంతా అట్టుడికి పోతోంది. ఈ వ్యాధి నివారణకు ప్రభుత్వాలు పాఠశాలలను, సినిమాహాళ్ళను మూత వేసాయి. ప్రజలు తమ ముక్కూ మూతికీ మాస్కులు వేసుకుంటున్నారు. మూడు రూపాయలకు అమ్మే మాస్కు 60 రూపాయలకూ దొరక లేదంటే మాస్కుల గిరాకీ ఏమిటో అర్థం చేసుకోవచ్చు.

ఈ మాస్కులు కరోనా వ్యాధిని నివారించగలవా? మాస్కులను కట్టుకోవడం అవసరమా? మాస్కుల వల్ల ప్రయోజనం ఉందా? లేదా? ఎవరు వాడాలి? ఎప్పుడు వాడాలి? ఎలా వాడాలి? అనే విషయాలను తెలుసుకోవాల్సిన అవసరం ఈ సందర్భంగా మన ముందుకు వచ్చింది.

**వైద్య పరిశోధనా మండలి సూచనలు :**

ప్రపంచ ఆరోగ్యసంస్థ, కేంద్ర కుటుంబ ఆరోగ్యశాఖ, భారతీయ వైద్య పరిశోధనా మండలి జారీ చేసిన సూచనల ప్రకారం కరోనా నివారణకుగాను దేశంలోని ప్రజలందరూ మాస్కులు కట్టుకోనవసరం లేదు. వాటిని కట్టుకోవడం ద్వారా ఈ వ్యాధి నుంచి రక్షించుకోవచ్చనే అభిప్రాయంతో లక్షలాది మంది మాస్కులు కట్టుకుంటూ అనేకరకాల వైరస్‌లనూ తెచ్చుకుంటారు. అది ఎలా అని అనుకుంటున్నారా?

**చేతులు సబ్బుతో శుభ్రం చేసుకోవాలి**

ఒకసారి మాస్కు కట్టుకున్న తరువాత ఎట్టి పరిస్థితుల్లోనూ చేతితో దానిని తాకరాదు. మాట్లాడేటప్పుడు చేతితో మాస్కును కిందికి, పైకి లాగడం చేస్తుంటారు. దీనివల్ల చేతికి అంటుకున్న రకరకాల క్రిములు, వైరస్‌లు మాస్కులకు అంటించుకుంటారు. ఇలా మాస్కులకు అంటుకున్న వైరస్ నోరు, ముక్కుల ద్వారా ఊపిరితిత్తుల్లోకి చేరే ప్రమాదం ఉంది. ఒక్కసారి కట్టుకున్న మాస్క్ ఆరు గంటలు మాత్రమే పనిచేస్తుంది. ఆ తర్వాత దాన్ని తీసివేసి, వేరే మాస్క్‌ను వాడుకోవాలి. కానీ సాధారణ ప్రజలు ఒకే మాస్కును రోజుల తరబడి వాడుతున్నారు. దీనివల్ల ప్రమాదా లను పెంచుకోవడమే. ఇలా ప్రతి ఆరు గంటలకు ఒక మాస్కును మార్చుకోవడం సాధారణ ప్రజానీకానికీ వారి వృత్తి, ఆర్థిక పరిస్థితి రీత్యా సాధ్యం కాదు. వ్యయ ప్రయాసలకు ఓర్చి కట్టుకున్నా కోరుకున్నంత లేదా అవసరమయినంత రక్షణ ఉండదు. వీటికంటే తరచుగా సబ్బుతో చేతులు శుభ్రం చేసుకోవడం చాలా మంచిది.

**వీరు తప్పక వాడాల్సిందే!**

కరోనా రోగికి వైద్యం చేసే డాక్టర్లకూ, వైద్య సిబ్బందికీ, కరోనా వ్యాధిగ్రస్తుల శుభ్రతకు వుపయోగపడే పారిశుధ్య సిబ్బందికీ, దగ్గరుండి చూసుకునే సహాయకులకూ కరోనా వ్యాధి సోకే అవకాశం ఎక్కువగా ఉంటుంది. వారిని అత్యధిక ప్రమాదమున్న బృందంగా గుర్తిస్తారు. వీరు మాత్రం ఈ మాస్క్‌లను తప్పనిసరిగా వాడాలి. ఎందుకంటే రోగి నుంచి ఆ వైరస్ వీరికి సోకకుండా వుండడానికి.

రోగికి సహాయకులు, రోగిని పరామర్శించడానికి వచ్చేవారూ మాస్కు కట్టుకోవాలి. కరోనాతో బాధపడుతున్న రోగి తప్పకుండా మాస్కు వాడాలి. రోగి మాస్క్ కట్టుకోవడం వల్ల రోగికి వుపయోగం ఏమీ లేదు. కానీ అది సమాజానికి వుపయోగపడుతుంది. తన నోటి నుంచి ముక్కు నుంచి వెలువడే వైరస్‌ను ఇతరులకు వ్యాపించకుండా ఈ మాస్కు పనిచేస్తుంది.



**మాస్కులు పలురకాలు :**

సర్జికల్ మాస్కులని, రెండు లేయర్ల మాస్కులని, మూడు లేయర్ల మాస్కులని, ఎన్ 95 మాస్కులని అనేక రకాలు అందుబాటులో ఉన్నాయి. ఎన్95 మాస్కు ఎక్కువ వుపయోగం. కానీ వాటి ఖరీదు ఎక్కువ.

మాస్కుల వాడుకపై ప్రపంచ ఆరోగ్య సంస్థ కొన్ని పద్ధతులను సూచించింది. అవి ఏమంటే...

- ❖ మాస్కును కట్టుకునే ముందు చేతులను సబ్బుతో గానీ ఆల్కహాల్‌తో కూడిన స్టెరిలైజర్తో గానీ 40 సెకండ్ల పాటు శుభ్రం చేసుకోవాలి.
- ❖ మాస్కును కట్టుకున్న తర్వాత దానిని ఎట్టి పరిస్థితులలోనూ చేతులతో పైకీ కిందకీ లాగడం, మాస్కును సర్దుకోవడం వంటివి చేయకూడదు.
- ❖ మాస్కును ఎట్టి పరిస్థితిల్లోనూ చేతితో తాకకూడదు. ఏదైనా అవసరమై మాస్కును తాకాల్సి వస్తే, చేతులను తప్పనిసరిగా సబ్బుతో శుభ్రం చేసుకున్న తర్వాతే తాకాలి. చేతులను శుభ్రం చేసుకోకుండా తాకితే ఆ మాస్కును తీసివేయాలి. అలా జరగకపోతే చేతికున్న క్రిములు మాస్కుకు పాకవచ్చు. దీనివల్ల వ్యాధి సోకవచ్చు.
- ❖ మాస్కును తీసేటప్పుడు వెనుక నుండి తీయాలి. మాస్కు తీసివేసిన తర్వాత చేతులను శుభ్రంగా సబ్బుతో కడుక్కోవాలి.
- ❖ వాడిన తర్వాత తీసివేసిన మాస్కును ఎక్కడంటే అక్కడ వేయకూడదు. దానిని ప్రత్యేకమైన చెత్త బుట్టలో వేయాలి. వాటిని తగలబెట్టడం కానీ, భూమిలో పూడ్చి బెట్టడం కానీ చేయాలి. అలా చేయకపోతే ఈ మాస్కుల కారణంగా కరోనా వ్యాధి మరికొందరికి వచ్చే అవకాశం వుంది.
- ❖ కరోనా నివారణకు ప్రజలందరూ మాస్కు కట్టుకోవాల్సిన అవసరం లేదు. ఎదుటివారు తుమ్మినప్పుడూ, దగ్గినప్పుడూ విడుదలయ్యే గాలి తుంపర్లు మన ముఖం మీద పడకుండా వుండేందుకుగాను మాస్కు ఉపయోగపడుతుందన్న భావనతో వీటిని కట్టుకుంటారు. మాస్కుని సరైన పద్ధతిలో వాడకపోతే కరోనా వైరస్‌ని నిరోధించడం సాధ్యంకాక పోగా కరోనా వ్యాధి వ్యాప్తి జరిగే అవకాశమే ఎక్కువ.
- ❖ సరైన పద్ధతులను అనుసరించ లేకపోతే మాస్కును వాడకపోవడం మంచిది. గంటకోసారి చేతులను సబ్బుతో శుభ్రం చేసుకోవడం ద్వారానే కరోనా వ్యాప్తిని చాలావరకూ నిరోధించగలం. ✷



రచనా ముద్రబోయిన

# కరోనా మహమ్మారి మరియు ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీ



**సామాజిక దూరం**

జనతా కర్ఫ్యూ పెట్టిన వెంటనే, నిరంతరంగా లాక్ డౌన్ ప్రకటించారు. ఇది రోజువారీ పని చేసుకునే ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీపై ప్రభావం చూపింది. నిజానికి సామాజిక దూరం పాటించడం ద్వారా ఈ వ్యాధిని అరికట్టవచ్చును, కాని దీని వలన దురదృష్టవశాత్తు అంటరానితనం మన దేశ జనాభాపై తన కోరలను సాచింది. బ్రాహ్మణ ఛాందసవాదం ట్రాన్స్ జెండర్ వ్యక్తులను అభివృద్ధి కార్యక్రమాలు, పథకాల నుంచి దూరంగా పెట్టింది. మా పాట్లు మేమే పడాలని వదిలేసారు. ఇలాంటి కఠోరమైన నిర్లక్ష్యం మా జీవితాలపైన రెండు రకాల ప్రభావం చూపుతుంది, ఒకటి మమ్మల్ని పట్టించుకునే వారు లేక చనిపోవడం, రెండవది సామాజికంగా అంటరానివారి లాగా జీవించడం.

కోవిడ్ మహమ్మారి ఉన్న ఈ సమయంలో మా జీవితాలకు విలువలేదని మేము అనుకునే విధంగా ఈ భయంకర భారం మా భుజాలపైన మోయడం అవసరామా!. సామాజిక దూరం అనే పదం బదులుగా శారీరక దూరం అని పిలవడం మంచిదని మానవ హక్కుల కార్యకర్తలు పోరాడుతున్నా కూడా అనాదిగా వస్తున్న వివక్షత ప్రభావం చూపుతూ ప్రస్తుత కాలంలో తీవ్రం అవుతోంది. కరోనా కారణంగా మరణించిన మొదటి హిజ్రా కమ్యూనిటీకి చెందిన మధ్యప్రదేశ్ హిజ్రా గురువు అంత్యక్రియలు ముగిసిన వెంటనే అక్కడ ఉన్న హిజ్రా కమ్యూనిటీ వారిని క్వారంటైన్‌కి తరలించి, ఆ స్థలాన్ని సీల్ చేసారు. మరొక సందర్భంలో ఒక ట్రాన్స్ మహిళను పురుషులు ఉన్న క్వారంటైన్‌కి తరలించారు. మరొక ట్రాన్స్ మహిళ ఇలాంటి పరిస్థితుల్లో ఆర్థిక సహాయం లేక లాక్ డౌన్ కారణంగా మందులు తెచ్చుకోలేని పరిస్థితిలో ఆత్మహత్య చేసుకుంది. మరో ట్రాన్స్ మహిళను వరంగల్ జిల్లాలో ఒక క్యాబ్ డ్రైవర్ పొడిచి హత్య చేసాడు. ఒక స్థానిక వార్తాపత్రికలో ఆమె అతన్ని తన కోరిక తీర్చమని అడిగినందుకు చంపాడని ప్రచురించారు.

ఈ మహమ్మారి కారణంగా ట్రాన్స్ జెండర్ వ్యక్తులు వ్యక్తులు మరింత వివక్షతకు గురౌతున్నారని పై ఉదాహరణలు చూస్తే అర్థమవుతుంది. ట్రాన్స్ జెండర్ వ్యక్తులను చట్టం దృష్టిలో అందరితో సమానంగా చూడకపోవడం, న్యాయపరంగా విభిన్నతను కలుపుకోకపోవడం సాగుతుంది.

**సహాయ కార్యక్రమాలు**

జనాభా లెక్కలలో ట్రాన్స్ జెండర్ వ్యక్తులను పరిగణనలోకి తీసుకోకపోవడం వలన రేషన్ కిట్‌ల జాబితాలు లేవు. కరోనా రిలీఫ్ కార్యక్రమంలో భాగంగా మాకు అందవలసిన ఫేస్ మాస్క్ లేదా శానిటైజర్లు లేవు. 2011 లో చేసిన జనాభా లెక్కలు చాలా పాతవైపోయాయి. అంతేకాక తీసుకున్న వివరాల గురించి మాకు ఎటువంటి సమాచారం ఇవ్వలేదు. పైగా ఆ జాబితా పదేళ్ళ క్రితం తీసుకుని అందులో మమ్మల్ని పురుషులుగా గుర్తించారు.

ప్రభుత్వ ఉత్తర్వులు, సర్క్యులర్లు, కోర్టు తీర్పులు ట్రాన్స్ జెండర్ కాని వారి సమస్యలను పరిష్కరించడానికి మాత్రమే ఉన్నాయి. ఈ ఉత్తర్వులు, సర్క్యులర్లు, తీర్పులు ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీ వారి సమస్యలు, ఇబ్బందులు, అంశాలను పరిష్కరించడానికి మాత్రం కావు. ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసి ట్రాన్స్ జెండర్ వ్యక్తులకు నిత్యావసర వస్తువులు, వసతి సదుపాయాలను సమకూర్చిన మొదటి రాష్ట్రం కేరళ. ఇదివరకే స్థాపించిన కుదుంబ స్త్రీ అనే స్వచ్ఛంద సంస్థ ద్వారా ఈ పంపిణీ చేశారు. కేరళ ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయం గురించి తెలిసిన ట్రాన్స్ జెండర్ కార్యకర్తలు ఆర్థిక మంత్రిత్వ శాఖ, సామాజిక న్యాయం మరియు సాధికారత మంత్రిత్వ శాఖ ఈ సదుపాయాలను సమకూర్చాలని అర్జీలు పెట్టారు. కోవిడ్ మహమ్మారి సహాయ నిధుల్లో భాగంగా మనిషికి 1,500 రూపాయలు చొప్పున ఇచ్చేందుకు ఈ రెండు మంత్రిత్వ శాఖలు ఒక కార్యక్రమాన్ని ప్రారంభించారు. వివరాలు దాఖలు చేసిన ట్రాన్స్ జెండర్ వ్యక్తుల బ్యాంకు ఖాతాలలో నిధులు జమచేయ బడతాయి. కాని దేశంలో ఉన్న ట్రాన్స్ జెండర్ వ్యక్తులందరికీ బ్యాంకు ఖాతాలు ఉన్నాయా? కొందరికి మాత్రమే ఖాతాలు ఉన్నాయి.

చాలామందికి బ్యాంకు ఖాతాలు కానీ, వారు ఇష్టపడే లైంగిక గుర్తింపు కార్డు కానీ లేవన్న విషయం కార్యకర్తలు మంత్రిత్వశాఖకు తెలిపిన వెంటనే వారు ఆ పథకాన్ని రెండు భాగాలుగా విభజించారు, ఒకటి బ్యాంకు ఖాతాలు ఉన్నవారికి, మరొకటి బ్యాంకు ఖాతాలు లేని వారికి. ఖాతాలు లేని వారు వారి ప్రస్తుత లైంగిక గుర్తింపు మరియు ప్రస్తుతం వారు ఉంటున్న ఇంటి వివరాలు కలిగిన గుర్తింపు కార్డును చూపించాలి.

దీని కారణంగా ట్రాన్స్ జెండర్ వ్యక్తులు రిస్క్‌లో పడిపోతారు. అసామ్‌లో జరిగిన జాతీయ పౌరసత్వం జాబితాలో కనీసం 2000 మంది ట్రాన్స్ జెండర్ వ్యక్తులను పౌరులుగా గురించలేదు. వారి గుర్తింపు కార్డులను పొందుపరచమని ట్రాన్స్ జెండర్ వ్యక్తులను అడిగిన వెంటనే కార్యకర్తలు సామాజిక న్యాయశాఖకు ఈవిధంగా వారి గోప్య సమాచారాన్ని అడుగరాదని వినతిపత్రం సమర్పించారు. కార్యకర్తలు మరియు మంత్రిత్వ శాఖల మధ్య చాలా సంప్రదింపులు జరిగిన తరువాత కనీసం 5000 మంది ట్రాన్స్ జెండర్ వ్యక్తులు ప్రభుత్వ పథకాల నుండి లబ్ధి పొందారు. వారి బ్యాంకు వివరాల సేకరణ మొదట అంశంగా మంత్రిత్వ శాఖలో పొందుపరిచారు. ఒకవేళ ఎవరికైనా ట్రాన్స్ జెండర్ వ్యక్తుల సమాచారం 2011 జనాభా జాబితా నుంచి సేకరించాలనుకున్నా వారు దేశ జనాభాలో 1 శాతం మాత్రమే ఉంటారు.

లాక్ డౌన్ పొడిగించిన తరువాత ప్యాకేజీని రూ.1500 నుండి రూ.3,000కి పెంచమని మరియు మిగతా 99 శాతం కమ్యూనిటీకి కూడా ఈ పథకాలు లభించే విధంగా చేయమని మంత్రిత్వ శాఖకు రాసారు. కమ్యూనిటీకి సహాయ కార్యక్రమం అందించే విధానంలో జాప్యం జరుగుతోంది. ట్రాన్స్ జెండర్ వ్యక్తులు రాబోయే వారాలు, నెలల్లో ప్రభుత్వం నుంచి ఏమి ఆశించాలో సమాచారం లేదు. ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీ ఇచ్చిన జాబితాను వారి స్వంత లాభానికి వాడుకొనే విధంగా కనిపిస్తోంది. 2014లో సుప్రీంకోర్టు ఇచ్చిన నాల్సా మరియు యూనియన్ బ్యాంక్ తీర్పును కొనసాగిస్తూ ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీ వ్యవస్థను సమస్థీకరించడం అవసరం. కాని ఇప్పుడు పాటిస్తున్న పద్ధతి ట్రాన్స్ జెండర్ వ్యక్తులను వేరు చేసి వారు ఎప్పుడూ ఈ దేశ పౌరులు కారనే విషయాన్ని మళ్ళీ మళ్ళీ నిరూపిస్తోంది.

**పరీక్షలు మరియు క్వారంటైన్**

**లాజిస్టిక్స్ మరియు నిధులు :** కోవిడ్ 19 పరీక్షించే కిట్ మరియు అవసరమైన ఆరోగ్య సిబ్బంది, పిపిఈ కిట్‌లు మరియు తరచూ కరోనా పరీక్షలు చేసే వ్యవధి వంటి పెద్ద ప్రశ్నలకు సమాధానం లేదు. ట్రాన్స్ జెండర్ వ్యక్తులను పరీక్షించి, క్వారంటైన్ చేయడానికి ప్రభుత్వం దగ్గర ఎటువంటి పథకాలు, వుత్తర్వులు లేవు. ట్రాన్స్ జెండర్ వ్యక్తులను జైళ్ళలో, బాలనేరస్థుల గృహాలలో పెట్టడం ఎలాంటి సమస్యో వారిని సంస్థాగతంగా క్వారంటైన్ చేయడం కూడా అంతే సమస్య. కాని మణిపూర్, పశ్చిమ బెంగాల్‌లో ఈ సమస్య లేదు. అక్కడ ట్రాన్స్ పురుషులు, ట్రాన్స్ మహిళలకు పడకలు ఉన్న సదుపాయం ఉంది, మిగతా రాష్ట్రాలలో ఈ సౌకర్యం ఇంకా ప్రారంభించలేదు.

దురదృష్టవశాత్తు ట్రాన్స్ ఫోబియా సామాజిక దూరం రూపంలో ముసుగు వేస్తోంది. చాలా సందర్భాల్లో పరీక్షా కేంద్రాల నుంచి ట్రాన్స్ జెండర్ వ్యక్తులను వెనక్కి పంపివేయడం, వారిని పురుషుల క్వారంటైన్ కేంద్రాలకు పంపడం జరుగుతుంది. దీని వలన చాలామంది ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీ వారికి రోగాన్ని అరికట్టడం మరియు విస్తృత చికిత్సకు దూరమవుతున్నారు.

**మానవ హక్కులు**

లాక్ డౌన్ ప్రకటించిన తరువాత ఆహార హక్కు, నివాస హక్కు, జీవనోపాధి హక్కు వంటి సాధారణ మానవ హక్కుల విషయంలో ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీ ప్రస్తుత పరిస్థితుల్లో పూర్తిగా వంచించబడ్డారు. న్యాయస్థానాలు కూడా సహకరించడం లేదు. ఈ మధ్యనే ఢిల్లీ హైకోర్టు ఒక యువ న్యాయవాదిని ఖర్చులు భరించాల్సి ఉంటుందని మందలించింది. ఒక పబ్లిక్ ఇంట్రెస్ట్ లిటిగేషన్‌ను ఫైల్ చేశారు. ఆర్థిక, ఆహార సహకారం, అద్దెను మినహాయించే వసతి సదుపాయం మరియు ఇతర ఆరోగ్య సహకారం, మందులు మరియు ఢిల్లీలో నివసిస్తున్న సెక్స్ వర్కర్లు, లెస్బియన్లు, బైసెక్సువల్, గేస్ మరియు ట్రాన్స్ జెండర్ వ్యక్తులకు లాక్ డౌన్‌లో ఆదుకోవడానికి రాష్ట్ర ప్రభుత్వం అందజేయాలని కోరింది. క్వ్యార్ వ్యక్తుల జాబితా వివరాలు ఉన్నాయా అని అడిగినప్పుడు తన దగ్గర లేవని క్వ్యార్ వ్యక్తుల తరఫున వాదించే లాయర్ చెప్పారు. ఇప్పుడు ఫైల్ చేసిన పిటీషన్ కాపీ జతపరచమని, సంక్షిప్తంగా ఇతర పబ్లిక్ ఇంట్రెస్ట్ లిటిగేషన్ ఏదైనా వుంటే, తాను ఫైల్ చేస్తున్నాడా లేదా ఇతరుల తరఫున ఫైల్ చేస్తున్నాడా వంటి అర్థం లేని వ్యాఖ్యలు చేసింది. వీటికి భిన్నంగా బీహార్ హైకోర్టు,తెలంగాణ హైకోర్టు మరియు ఝార్ఖండ్ హైకోర్టులు కొన్ని ప్రగతిశీల ఉత్తర్వులు జారీచేసారు, అందులో ముందు సూచించిన సేవలతో పాటు వ్యక్తిత్వ వివరాలు అడగకుండా హెచ్ ఐ వీ తో జీవించేవారికి ఏ ఆర్ టీ మందులు, వారికి రేషన్‌కార్డులు లేనందున మున్ముందు అవసరమయ్యే రేషన్‌కార్డు సదుపాయం కూడా అందజేయాలని ఈ మూడు రాష్ట్రాలలో ఉత్తర్వులు జారీ చేశారు.

నల్సా మరియు యూనియన్ ఆఫ్ ఇండియా మధ్య జరిగిన న్యాయ పోరాటం ట్రాన్స్ జెండర్ కార్యకర్తలు మరియు మానవహక్కుల కార్యకర్తలు కోర్టులను ఆశ్రయించి న్యాయపరమైన వ్యాఖ్యానానికి ఒక్కొక్క ఇటుక పేర్చి ట్రాన్స్ జెండర్ కమ్యూనిటీ యొక్క రాజ్యాంగ హక్కులను పరిరక్షించే విధంగా ఒక చారిత్రాత్మక నిర్ణయానికి దారి చూపారు, కాని ఇవి కేంద్రం కాని, రాష్ట్ర ప్రభుత్వాలు కానీ చేయలేకపోయాయి. ట్రాన్స్ వ్యక్తుల చట్టం (హక్కుల రక్షణ), 2019లోని రక్షణ మరియు పునరావాసం చట్టం ట్రాన్స్ జెండర్ వ్యక్తులను మేలుకొలిపింది. గతంలో ఎలాగైతే సెక్స్ వర్కర్లను బలవంతంగా పునరావాసాలకు తరలించారో అదే విధంగా వెట్టిచాకిరి చేసే బానిసల ముసుగులో ఇప్పుడు ట్రాన్స్ జెండర్ వ్యక్తులను కూడా అదే విధంగా చేసే ప్రయత్నం జరగబోతోంది. ప్రస్తుత లాక్ డౌన్ పరిస్థితుల్లో ఇలాంటి క్లిష్టమైన అంశాలకు తావులేదు. పలుమార్లు కోర్టులు మా సమస్యలను పూర్తిగా తోసిపుచ్చిన సందర్భాలు ఉన్నాయి. కోర్టులు నిర్దాక్షిణ్యంగా మా అర్జీలను తోసిపుచ్చారు.

**ఆరోగ్య సమస్యలు**

లింగ పరివర్తన అనేది ట్రాన్స్ జెండర్ వ్యక్తులు చేయవలసిన చాలా క్లిష్టమైన ప్రయాణం. ఎందుకంటే దీనిని చేయడానికి తాఖీదు పొందిన నిపుణులు లేరు. పాలసీలు లేవు. చట్టపరమైన పద్ధతులు లేవు. లింగ పరివర్తన మరియు హార్మోన్ల అసమతుల్యత కారణంగా ట్రాన్స్ జెండర్ వ్యక్తులు తీవ్రమైన మధుమేహం, అధిక రక్తపోటు వంటి అనేక ఆరోగ్య సమస్యలతో బాధపడుతుంటారు.

**(తరువాయి వచ్చేసంచికలో)**



# ఇప్పుడు నిర్ణయం నీది! నాది!! మనది!!



ప్రార్థనా స్థలాలన్నీ ఎడారులుగా మారాయి!
కానీ ఆసుపత్రులు పనిచేస్తున్నాయి...
భయంతో అందరూ ప్రయాణాలు మానుకుంటున్నారు!
తమ బోధనాలతో ఊదరగొట్టే మతాధిపతులూ,
మఠాధిపతులు, స్వస్థత కూటాల నిర్వాహకులూ
ఎక్కడా కనిపించట్లేదు!
కానీ శాస్త్ర వేత్తలూ, వైద్యులూ కరోనా రోగుల సేవలో
నిరాటంకంగా పనిచేస్తునారు...
కరోనా వైరస్‌కు గోమూత్ర వైద్యం వికటించి గుజరాత్‌లో
పాతిక మంది అమాయకులు ఆసుపత్రి పాలయ్యారు.
అయితే ఇప్పుడు గోవైద్యులు ఎక్కడా కనిపించడం లేదు.
కరోనా వైరస్ దెబ్బకు యూరపులో చర్చిలు,
ఇరాన్‌లో మసీదులు, ఇండియాలో స్వామి నారాయణ్
మందిరాలు మూతపడ్డాయి!
కానీ వైరస్‌ను అదుపు చేయడానికి వైద్య పరిశోధన కేంద్రాలు,
వైద్య శాలలు నిరంతరం తెరిచివుంటున్నాయి,
పనిచేస్తూనే ఉన్నాయి...
మానవత్వం చూపాల్సిన వేళ దేవాలయాలూ, చర్చిలూ,
మసీదులూ మూతబడుతున్నాయి!
- కానీ, కానీ సైన్స్ ఒక్కటి మాత్రమే మనిషి కోసం
పనిచేస్తూనే వుంది...



ఇప్పుడు నిర్ణయం మీదే -
దైవమా - మానవత్వమా !
నమ్మకమా - వాస్తవమా !
మతమా - సైన్సా !

# ప్రమాదకర కరోనా కాల నేపథ్యం

## అయినా బాధితుల ప్రాణానికి ప్రాణం అడ్డేస్తున్న అంగన్వాడీ తల్లులు



వారు కంటికి కనిపించని కరోనాతో ప్రతిక్షణం యుద్ధం చేస్తున్నారు. మనుషుల ప్రాణాలను కబళించాలని చూస్తున్న కరోనాకు ఎదురొడ్డి నిలబడుతున్నారు. గర్భిణులు, పసిబిడ్డలు, బాలింతల ప్రాణాలకు వారి ప్రాణాలను అడ్డుగా వేస్తున్నారు. కష్టకాలంలో కన్నతల్లిలా మేమున్నామనే భరోసా ఇస్తున్నారు. వారిలోని మానవత్వాన్ని చాటుతూ ఎందరో ప్రశంసలు అందుకుంటున్నారు. వారే అంగన్వాడీ అమ్మలు..

ప్రస్తుతం ప్రపంచమంతా కరోనా విలయతాండవం చేస్తోంది. ఇలాంటి ప్రమాదకర సమయంలో గర్భిణులు, పసిబిడ్డలు, బాలింతలు బయటకు రావడం మంచిది కాదని వైద్య నిపుణులు చెబుతున్నారు. వాస్తవానికి రాష్ట్ర ప్రభుత్వం వారందరికీ ఐసీడీఎస్ ద్వారా ఎప్పటి నుంచో పౌష్టికాహారాన్ని అందిస్తోంది. ప్రస్తుతం దేశమంతా లాక్‌డౌన్‌లో ఉంది. ఈ సమయంలోనూ వృత్తిపట్ల అంగన్వాడీ కార్యకర్తల నిబద్ధత, మానవత్వాన్ని తెలియజేసే కొన్ని సంఘటనలు జరిగాయి.

వైకల్యం శరీరానికే...!

లాక్‌డౌన్ సమయంలో అందరి ఇళ్లకూ తిరిగి పౌష్టికాహారాన్ని అందజేయడం అంగన్వాడీ కార్యకర్తలకు సవాలుగా మారింది. అలాంటిది ఓ విభిన్న ప్రతిభావంతురాలు పౌష్టికాహారాన్ని అందరికీ చేర్చడం అంటే మాటలు కాదు. అందుకేనేమో వృత్తిపట్ల ఆమెకున్న నిబద్ధతను చూసి కేంద్ర ప్రభుత్వ మహిళావృద్ధి, శిశు సంక్షేమ మంత్రిత్వశాఖ ప్రశంసించింది. ఆమె ... గుంటూరు జిల్లా ఈపూరు ఐసిడిఎస్ ప్రాజెక్టు పరిధిలోని బొల్లపల్లికి చెందిన అంగన్వాడీ కార్యకర్త సాకిరా బాయి. చాలా కాలంగా ఆమె ఐసిడిఎస్‌లో పనిచేస్తున్నారు. మొదటి నుంచీ వృత్తి పట్ల ఏమాత్రం అశ్రద్ధ చూపేవారు కాదు. మూడు చక్రాల బండికే పరిమితం అయినా.. దానినే రవాణా వాహనంగా మార్చుకున్నారు. స్వయంగా ప్రతి ఒక్కొరి ఇంటికీ వెళ్లి, పౌష్టికాహారాన్ని పంపిణీ చేశారు. ప్రస్తుతం ఆమెకు దేశవ్యాప్తంగా అభినందనలు అందుతున్నాయి. రాష్ట్ర మహిళావృద్ధి, శిశ సంక్షేమ శాఖ సంచాలకులు డాక్టర్ కృతికా శుక్లా మాట్లాడుతూ సాకిరాబాయి జాతీయస్థాయిలో ప్రశంసలు అందుకోవడం గొప్ప విషయమన్నారు. వైకల్యం శరీరానికేగానీ సంకల్ప బలానికి కాదనీ.. మరోసారి రుజువు చేసిన ఆమెను అభినందించాల్సిందే!

ఆయానే అమ్మగా...!

ఏ స్త్రీకి అయినా కాన్పు అంటే మరో జన్మతో సమానం. ఆ సమయంలో అయినవారు దగ్గర వుండాలని కోరుకుంటారు. కర్నూలు జిల్లా నంద్యాలకు చెందిన దివ్యభారతి కూడా



అలానే కోరుకుంది. ఆమెకు నెలలు నిండుతున్నాయి. దేశమంతా లాక్‌డౌన్‌లో వుంది. కన్నతల్లి లాక్‌డౌన్ వల్ల తన చెంతకు రాలేకపోయింది. ఇరుగు పొరుగును సాయం అడిగినా కరోనా భయంతో ఎవరూ ముందుకు రావడం లేదు. ఒకవైపు బిడ్డ పుట్టబోతున్నదనే సంతోషం.. మరోవైపు ఈ కష్టాన్ని ఎలా దాటాలా? అనే ఆలోచనలతో ఆ దంపతులు సతమత మయ్యారు. దివ్యభారతికి నొప్పులు రావడం మొదలైంది. ఏమి చేయాలో దిక్కుతోచని స్థితిలో ఉన్న వారికి అర్బన్ అంగన్వాడీ కేంద్రం ఆయా చెన్నమ్మ గుర్తుకొచ్చారు. మాకు సాయం చేస్తారా? అని అడిగిన వెంటనే ఆటోలో ఇంటిముందు ప్రత్యక్షమయ్యారామె. క్షణాల్లో ప్రభుత్వాసుపత్రికి తీసుకెళ్లారు. దివ్యభారతి పండంటి బిడ్డకు జన్మనిచ్చింది. రెండు రోజులు హాస్పిటల్‌లోనే ఉండి, కన్నతల్లిలా సేవలు చేశారు చెన్నమ్మ. ఆమెలోని అమ్మతనాన్ని, సహాయస్ఫూర్తిని గుర్తించిన జిల్లా కలెక్టర్ జి.వీరపాండియన్ 20 వేల నగదు బహుమతితోపాటు, ప్రశంసాపత్రాన్ని ఇచ్చారు. కన్నతల్లిలా సేవలు చేసిన చెన్నమ్మకు జీవితాంతం రుణపడి ఉంటామని దివ్యభారతి దంపతులు కృతజ్ఞతలు తెలిపారు.

**రక్తదానం చేసి...!**

గుంటూరు జిల్లా పెటసన్నెగండ్ల సెక్టార్‌కు చెందిన అంగన్వాడీ కార్యకర్త ఎన్.సత్యవతి మరో అడుగు ముందుకేశారు. ఆమె సెక్టార్‌లోని నిండు గర్భిణీని హాస్పిటల్‌లో చేర్పించి,రెండు రోజులు సేవలు అందించారు. కాన్పు సమయంలో రక్తం ఎక్కించడం తప్పనిసరి అని డాక్టర్లు చెప్పారు. సత్యవతిది, గర్భిణిది ఒకే గ్రూపు కావడంతో రక్తదానం చేసి, మానవత్వాన్ని చాటారు.

**ఆర్థికంగా ఆదుకొని...!**

ఇంకా మాచర్ల ప్రాజెక్టు అంగన్వాడీ కార్యకర్త సునీతావిక్టోరియా కూడా కనికరమ్మ అనే గర్భిణిని ఆసుపత్రిలో చేర్పించారు. పేదరికంతో బాధపడుతున్న ఆమెకు ఆర్థికసాయాన్నీ అందించి, పెద్ద మనసును చాటుకున్నారు.

కరోనా కష్టకాలంలో వలస కార్మికుల కడుపునింపుతున్నారు కొందరు అంగన్‌వాడీ కార్యకర్తలు. పేదలకు తమవంతుగా నిత్యావసరాలు అందిస్తున్నారు మరికొందరు అంగన్‌వాడీలు. ఎక్కువమంది అంగన్‌వాడీలు మానవత్వంతో ఈ కరోనా కాలంలో శానిటైజర్లను తయారుచేసి, మాస్కులను కుట్టి, అందిస్తున్నారు. ఇలా తమ శక్తికిమించి సమాజానికి మేలుచేస్తున్న అంగన్వాడీ కార్యకర్తలను అందరం అభినందించాల్సిందే.

### బీమా వర్తింపజేయాలి!

కరోనా సమయంలో పనిచేస్తున్న పారిశుధ్య, వైద్య, పోలీసు సిబ్బందికి ప్రభుత్వం బీమాను ప్రకటించింది. అలాగే కరోనా సేవలు అందించే అంగన్వాడీ కార్యకర్తలకూ బీమా వర్తింపజేయాలి.రాష్ట్రవ్యాప్తంగా అంగన్వాడీ కార్యకర్తలు ఎన్నో సేవా కార్యక్రమాలను చేస్తున్నారు. వేల మాస్కులను కుట్టి, పంపిణీ చేస్తున్నారు. కొన్ని చోట్ల పెండింగ్‌లో ఉన్న టిఏ, సెంటర్ అద్దెలను ప్రభుత్వం వెంటనే చెల్లించాలి.

– కె. సుబ్బరావమ్మ
రాష్ట్ర ప్రధాన కార్యదర్శి,
ఏపీ అంగన్వాడీ వర్కర్స్ అండ్ హెల్పర్స్ యూనియన్

### భద్రతా పరికరాలు ఇవ్వాలి

రాజమండ్రిలో అంగన్వాడీ కార్యకర్తలు కొందరికి క్వారంటైన్‌ల దగ్గర డ్యూటీలు వేశారు. మరికొందరితో రెడ్‌జోన్‌లలో ఇంటింటి సర్వే చేయిస్తున్నారు. అయితే వారికి ఎలాంటి భద్రతా పరికరాలూ ఇవ్వలేదు. ప్రమాదంతో సహవాసం చేసే అంగన్‌వాడీ కార్యకర్తలకు వెంటనే వ్యక్తిగత భద్రతా పరికరాలు ఇవ్వాలి.

– చంద్రావతి,
ప్రధాన కార్యదర్శి, తూ.గో.జిల్లా,
ఏపీ అంగన్వాడీ వర్కర్స్ అండ్ హెల్పర్స్ యూనియన్

# ఇంటి పని కార్మికులు...
# పని లేక ఇబ్బంది పడుతున్నారు





కొవిడ్-19 లాక్‌డౌన్ వల్ల ఎంతోమంది జీవితాలు అల్లకల్లోలమయ్యాయి. రెక్కాడితే గానీ డొక్కాడని బతుకుల్లో మరింత బరువును మోపింది ఈ విపత్తు. ఇంటి పనివాళ్లకు లాక్‌డౌన్ ప్రారంభంతోనే పని పోయింది! ఇంటి సభ్యులే భౌతిక దూరాన్ని పాటించాల్సిన పరిస్థితుల్లో వాళ్లను పనికి రావొద్దని యజమానులు చెప్పేశారు. కొందరు ఒక నెల జీతం ఇచ్చి పంపారు. చాలామంది పని లేదు కాబట్టి జీతం లేదు అన్నట్టు వదిలేశారు. లాక్‌డౌన్ కొనసాగిన నేపథ్యం లో- ఇంట పనివాళ్లు ఇప్పుడు కష్టాలకు ఎదురీదు తున్నారు. అందుకే ఇప్పుడు వీళ్ల కోసం జాతీయ విధానాన్ని రూపొందించాలనే కోరిక బలంగా ముందుకొచ్చింది.

భారతదేశంలో పలు ఎగువ, మధ్య తరగతి కుటుంబాలకు ఇంటి పనివాళ్లు వెన్నెముకలాంటి వారు. మార్చి 24 నుంచీ అమలైన లాక్‌డౌన్ వారూ వీరు అనే తేడా లేకుండా మహిళలందరికీ పని భారం పెంచేసింది. ఎగువ వర్గాలకు చెందిన మహిళలు కూడా ఇళ్లల్లో పనితో పాటు ఇతరత్రా కార్యకలాపాలకు సమయాన్ని కేటాయించడంతో భారం ఎక్కువైంది. ఢిల్లీ, చెన్నై, బెంగళూరు, హైదరాబాదు వంటి మహానగరాల సమాచారాన్ని బట్టి లాక్‌డౌన్ ఉన్నప్పటికీ ఇంటి పనివాళ్లను పనిచేయడానికి రమ్మని వారి యజమానులయిన మహిళలు అడుగుతున్నట్లు తెలుస్తోంది. ఇంకొన్ని నివేదికలను పరిశీలిస్తే కొందరు యజమానులు వారి పనివాళ్లకు జీతంతో కూడిన సెలవు ఇచ్చినట్లు తెలిసింది. ఇంకొందరు యజమానులు డబ్బును ఆదా చేసుకోవడానికి ఇంటి పనివాళ్లను తొలగించడం, లేదంటే కొంతకాలం పాటు పనికి రానవసరం లేదని చెప్పి, ఆపారు. ఇక అకస్మాత్తుగా అమలైన ఈ లాక్‌డౌన్ వల్ల కొందరు పనివాళ్లు వారి జీతాన్ని తీసుకోవడానికి స్వయంగా వెళ్లలేక పోవడం, బ్యాంకు అకౌంట్లు లేకపోవడం, సాంకేతిక వినియోగం అందుబాటులో లేకపోవడం వంటి కారణాలతో చేతిలో చిల్లిగవ్వ లేకుండా రోజులు గడపాల్సి వస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లో 'ఇంటిపనివాళ్ల' భవిష్యత్తు ప్రశ్నార్థకంగా మారింది.

**నెల జీతమే ఆధారం**

ఇటీవల ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్, అహ్మదాబాద్ ఒక పరిశీలన నిర్వహించింది. ఇందులో 400 మంది ఇంటిపనివాళ్ల మాటలను బట్టి ఆయా కుటుంబాల్లో వారి సంపాదనే ఎంతో కీలకం. ఈ సంపాదనకు గండి పడితే కుటుంబ అవసరాలు తీరవని 86శాతం మంది మహిళలు చెప్పారు. ఇక కుటుంబం సజావుగా గడవడానికి తమ నెల జీతమే ప్రధానపాత్ర వహిస్తుందని 69శాతం మహిళలు అన్నారు. వీరిలో కొందరికి నెల సంపాదన 20 వేల కంటే తక్కువ ఉంటే, ఇంకొందరికి పది వేల కంటే తక్కువగా వుంది. ఇలాంటి కుటుంబాల్లో భార్య భర్తలిద్దరూ అసంఘటిత రంగంలోనే పని చేస్తుంటారు. కనుక పనిలో, సంపాదనలో అస్థిరమైన పరిస్థితి ఉంటుంది. ఇక ఈ మహమ్మారి కథ ముగిసిన తర్వాత వచ్చే ఆర్థిక లోటు చాలామంది కార్మికుల ఉద్యోగాలు పోవడానికి కారణమవుతుంది. సెంటర్ ఫర్ మోనిటరింగ్ ఇండియన్ ఎకానమీ సేకరించిన సమాచారం మేరకు ఈ పరిస్థితి ఇప్పటికే మొదలైంది. మార్చి నెలలో 8.7 శాతం వున్న నిరుద్యోగం రేటు లాక్‌డౌన్ మొదలైన తర్వాత ఏప్రిల్ మొదటి వారానికే 23 శాతం పెరిగింది.

**లాక్‌డౌన్ లాభించిందా?!**

ఇంటిపనివాళ్లకూ, వారి కుటుంబాలకూ కరోనా మహమ్మారి సోకకుండా ఉండటానికి ఈ లాక్‌డౌన్ ఎంతవరకూ దోహదం చేసిందనేది మరొక ప్రశ్న. విదేశీ ప్రయాణం చేసిన యజమానుల నుంచే మహమ్మారి

**ఇటీవల ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ - అహ్మదాబాద్ ఓ పరిశీలన చేసింది. ఇందులో 400 మంది ఇంటిపని కార్మికులు చెప్పిన దానినిబట్టి వారి కుటుంబాల్లో మహిళల సంపాదన ఎంతో కీలకం. తమ సంపాదనకు గండి పడితే కుటుంబ అవసరాలు తీరవని 86 శాతం మంది మహిళలు వాపోయారు. కుటుంబం సజావుగా గడవడానికి నెల జీతమే ప్రధానపాత్ర వహిస్తుందని 69 శాతం మహిళలు అన్నారు. వీరిలో కొందరికి నెల సంపాదన 20 వేల లోపు ఉంటే, ఇంకొందరికి పది వేల కంటే తక్కువగా వుంది. ఇలాంటి కుటుంబాల్లో భార్య భర్తలిద్దరూ అసంఘటిత రంగంలోనే పని చేస్తుంటారు.**

వీరికి సోకే అవకాశం ఉంది. కొన్ని నివేదికల ప్రకారం - కొన్నిచోట్ల ఇంటి పనివాళ్ళకూ వైరస్ సోకినట్లు తెలుస్తోంది. మార్చి 23కి ముందు వ్యాధి బారిన పడిన వీళ్ల విషయంలో లాక్‌డౌన్ పెద్దగా చేసిందేమీ లేదు. ఎందుకంటే వాళ్ల ఇళ్లు చాలా ఇరుకు ప్రాంతాల్లో ఉంటాయి. ముంబయి లాంటి నగరాల్లోని మురికివాడల్లో అందరూ కలిసి మరుగుదొడ్లను వాడుతుంటారు. ఎక్కువ మంది నీటి వనరుల్ని కలిసి పంచుకుంటారు. ఇలాంటి చోట్ల భౌతిక దూరం పాటించడం చాలా కష్టం. అలాగే ఇంటిపనివాళ్లు రేషన్ సరకుల కోసం, ఇతరత్రా పనుల కోసం బయటకు వెళ్లాల్సి ఉంటుంది. అందువలన వీరికి వైరస్ సోకే అవకాశం లేకపోలేదు. అంతేకాక, ఈ మహిళల్లో పోషకాహార లోపం ఉంటుంది. రోగనిరోధక శక్తీ తక్కువగానే వుంటుంది. అందువలన వ్యాధి బారిన పడే అవకాశమూ ఎక్కువే.

**అభద్రతలో ఇంకెన్నాళ్లు?!**

భద్రతలేని ఈ పరిస్థితుల్లో ఉన్న ఇంటి పనివాళ్లు ఆర్థిక నష్టాన్ని భరించాలి. అలాగే వైరస్ సోకే ప్రమాదమూ ఉంది. అంతకు మించి చాలా ఇళ్లల్లో ఈ మహిళల పట్ల గృహ హింస ఎక్కువైనట్లు తెలుస్తోంది. ఐక్యరాజ్య సమితి ప్రధాన కార్యదర్శి, మన జాతీయ మహిళా కమిషన్ కూడా లాక్‌డౌన్ వల్ల గృహహింస పెరిగినట్లు హెచ్చరించారు. ఇంట్లో భర్త, అత్తింటివారు పెట్టే హింసను భరించలేక తప్పించు కోవడానికి పనిలోకి వెళ్తుంటే, అక్కడ యజమానులూ తనను హింసిస్తున్నట్లు ఒక పనిమనిషి వెల్లడించింది.



ఇక లాక్‌డౌన్ ముగిసే సమయానికి ఎగువ, మధ్యతరగతి వర్గాల కుటుంబాల సంపాదన తగ్గే అవకాశం ఉన్నందున, వాళ్లు ఖర్చులు తగ్గించు కోవాలనుకుంటారు. ఇందులో ఈ కార్మికుల జీతాలు కూడా ఉండకపోవు. అదే సమయంలో ఇళ్లల్లో పనిచేసే మహిళలకు పని చేసే అవసరం మరింత పెరుగుతుంది. దీనికి కారణం వారి భర్తలు నిరుద్యోగులుగా మారే అవకాశం ఉండటమే. అయితే పరిశీలనల ప్రకారం 40 శాతం మందికి కొత్త పనులు సులువుగానే దొరుకుతాయని చెప్పడం విశేషం.

**హక్కులు ఇచ్చే విధానం !**

ఈ నేపథ్యంలో ఇళ్లల్లో పనిచేసే పని వాళ్ల కోసం ఒక జాతీయ విధానాన్ని తీసుకు రావాల్సిన అవసరం ఉంది. దశాబ్దాలుగా ఇలాంటి పనుల్లో ఉండి, ఎలాంటి వృద్ధికీ నోచుకోని వీరికి ఈ విధానం ఊతమివ్వాలి. కరోనా లాక్‌డౌన్ ద్వారా వీరి అభద్రతా జీవితం మరింత వెలుగులోకి వచ్చింది. 20 సంవత్సరాల కంటే తక్కువ వయసున్నప్పటి నుంచీ ఈ పనిలోనే ఉంటున్న మహిళలు కోకొల్లలుగా వున్నారు. వీళ్లెవ్వరికీ అధికారిక ఒప్పందాలు లాంటివి ఏమీ ఉండవు. దశాబ్దాల పాటు ఇదేపని చేస్తూ వుంటారు. అందుకే ఈ జాతీయ విధానం వీళ్లని అసంఘటిత కార్మికులుగా గుర్తించే విధంగా ఉండాలి. సంఘాలు పెట్టుకోవాలి. అది వారి హక్కులనూ, లాభాలనూ వినియోగించు కునేటట్లు చేస్తుంది. అలాగే వారికి 'కనీస వేతనం', సామాజిక భద్రతతో పాటు ఫిర్యాదులు, విచారణ వ్యవస్థ సమకూరేలా ఉండాలి. అంతకు మించి వంటా వార్పు చేయడం మహిళల పని మాత్రమే కాదనీ.. అది పురుషులూ సమానంగా పంచుకునే మార్పు రావాలి.

లక్ష్మి అల్లాడ



# రేపటి ఉదయం

సావిత్రి నిద్రపోతోన్న తన కొడుకు కళ్యాణ్‌ని తదేకంగా చూస్తోంది!

కళ్యాణ్‌కి ఏడాది వయసప్పుడే సావిత్రి భర్త చనిపోయాడు. ఇక అప్పటి నుంచీ కొడుకే తన సర్వస్వం అనుకుంది. ఎన్నో అవమానాలు, బాధలు భరించింది. కష్టాల కన్నీళ్లు దిగమింగింది. కూలి పనులు చేసుకుంటూ కొడుకుని చదివించింది. కొడుకు గొప్పవాడై తనకు చేదోడువాదోడు అవుతాడని, తన కష్టాలు తీరుతాయని ఎన్నో కలలు కంటూ బతికింది. పరిస్థితులు తల్లకిందులుగా మారాయి.

"భగవంతుడా నాకే ఎందుకిలా జరుగుతుంది? నేను చేసిన పాపం ఏమిటీ" లక్ష్మి అనుకుంటుండగా పొయ్యిమీద పాత్రలో అన్నం పొంగిన శబ్దానికి ఒక్కసారిగా ఈ లోకంలోకి వచ్చి వంటగదిలోకి పరుగు పెట్టింది.

అలికిడికి నిద్రపోతోన్న కళ్యాణ్‌కి మెలకువ వచ్చి తల్లివైపు జాలిగా చూశాడు. "నువ్వు మగాడివి రా, మగాడిలా ఉండు" అని అమ్మ పదే పదే అనడం గుర్తుకు వచ్చి లీలగా నవ్వుకున్నాడు. ఈ సమాజం తనను ఒక మనిషిగా గుర్తించడం లేదు. ఇంక మగాడిగానా? అనుకున్నాడు. "అమ్మకు అర్థం కావడం లేదుగానీ నిన్న మేనమామ పెళ్లికి వెళ్ళినప్పుడు అమ్మతో దగ్గరి బంధువులు కొందరు "ఏంటే సావిత్రీ, కళ్యాణ్‌ని అమ్మాయికిచ్చి పెళ్లి చేస్తావా? అబ్బాయికిచ్చి పెళ్లి చేస్తావా?" అని హేళనగా మాట్లాడినప్పుడు అమ్మ మౌనంగా జీవచ్ఛవంలా నిల్చుండి పోయింది. తనకప్పుడు పట్టరాని కోపం వచ్చింది. కానీ ఏం చేయనూ చిన్నప్పట్నుంచి ఇలాంటి అవమానాలకు అలవాటు పడిపోయిన జీవితం. అందుకే మౌనమే సమాధానం అయింది, గుర్తుచేసుకున్నాడు కళ్యాణ్.

"ఏంరా కళ్యాణ్! ఇంకా అలాగే వుండి పోయావు! త్వరగా తెములు ఇంటర్వ్యూకు టైం అవుతోంది." సావిత్రి పిలుపుతో ఆలోచనల నుంచి బయట పడి పెరట్లోకి నడిచాడు. సమయం ఉదయం 10:30 గంటలు కావస్తోంది. కళ్యాణ్‌లో ఆందోళన మొదలైంది. ఉద్యోగం వస్తే తల్లికి ఎంతో ఊరటనిస్తుందని అనుకున్నాడు. "భగవంతుడా ఈసారైనా వుద్యోగం వచ్చేటట్టు చేయి తండ్రీ" అనుకుంటూ మనసులో ప్రార్థించుకొన్నాడు. అటెండరు నుండి పిలుపుతో ఊహల లోకం నుంచి బయటపడి కళ్యాణ్ కొండంత ఆశతో లోపలికి వెళ్ళాడు. ఇంటర్వ్యూ పూర్తయింది "నువ్వు ఈ వుద్యోగానికి పనికిరావని తేల్చి చెప్పారు. నీలాంటి వాళ్ళు రైళ్లలోనూ, షాపుల దగ్గరా అడుక్కోవాలి, ఇలా ఉద్యోగాల కోసం దరఖాస్తు చేయడం ఏంటని అవమానించి పంపేశారు. ఎప్పటిలాగే ఈసారి కూడా నిరాశే మిగిలింది. చదువు, తెలివితేటలు ఇవేవీ పట్టించుకోకుండా కేవలం తన జెండర్‌ని కారణంగా చూపి, ఉద్యోగం ఇవ్వకుండా బయటికి పంపేయటాన్ని తట్టుకోలేక పోయాడు. ఎందుకిలా వివక్ష చూపుతున్నారని ఆవేదన చెందాడు.

ఐదేళ్ల వయసులో కళ్యాణ్‌ను బడిలో చేర్పించింది అతని తల్లి లక్ష్మి. ఓ పూట తినీ, మరో పూట పస్తులుంటూ బిడ్డని చదివించింది. కళ్యాణ్ అందరి పిల్లల్లాగానే రోజూ బడికి వెళ్లాడు. తోటి పిల్లలతో ఆడుకునేటప్పుడు మాత్రం అమ్మాయిలతోనే ఆడుకునేవాడు. అందరితో కలిసేవాడు కాదు. ఇలా వయసు పెరుగుతున్న కొద్దీ కళ్యాణ్ ఆలోచనలో మార్పు మొదలైంది. తను మగపిల్లవాడినని తెలిసినా ఆడపిల్లలా వుండాలని

ఈ పరిస్థితి మారాలి. తామూ అందరిలాంటి మనుషులమే అన్న స్పృహ ఈ సమాజానికి రావాలి. తమకూ కొన్ని హక్కులు ఉంటాయిగదా?. వాటిని కాపాడే బాధ్యత కూడా ఈ సమాజానికి వుందని తెలియజేయాలి. తనలాంటి అభాగ్యులకు తానే గొంతు తానే అవ్వాలి అనుకుంటూ అలుపెరుగని ఆలోచనతో రేపటి ఉదయం కోసం ఎదురు చూస్తూ వుండి పోయాడు కళ్యాణ్ కాదు కళ్యాణి.

పించేది. ఎవరికీ తెలియకుండా పసుపు రాసుకోవడం, వాళ్లమ్మ చీర చుట్టుకోవడం, పూలు పెట్టుకోవడం వంటి పనులు చేస్తూ వుండేవాడు. కానీ ఎన్నాళ్లు అలా రహస్యంగా చేయగలడు? ఒకటి రెండు సార్లు వాళ్ళ అమ్మ కంట్లో పడ్డాడు. గట్టిగా మందలించింది. "నువ్వు మగాడివిరా! మగాడిలా ఉండాలిగానీ ఇలా ఆడపిల్లలా తయారుకావడం ఏంటి?" అని వారించింది. "నేను ఇలా ఉండడమే నాకిష్టం నన్నర్థం చేసుకోండి" అని అరవాలనుకున్నా, మౌనంగా పరిగెత్తుకుంటూ అక్కడ నుంచి వెళ్లిపోయేవాడు. గదిలో మూలన కూర్చుని తన తల్లికి వినపడకుండా కుమిలి కుమిలి ఏడ్చేవాడు. ఎంత వేదన అనుభవించినా, పరిస్థితి ఇది – అని చెప్పలేకపోయినా, తన ప్రవర్తనలో మార్పు మాత్రం కొద్ది కొద్దిగా బయటపడేది. దీంతో తోటి విద్యార్థులు, బయటి వ్యక్తులు తనని హేళనగా మాట్లాడడం మొదలుపెట్టారు. వేధించసాగారు. "ఆడంగి" అంటూ కాకుల్లా పొడుచుకు తినేవాళ్లు. ఇవన్నీ విని బాధపడేవాడు. తల్లి మాటలు, కష్టాలు గుర్తుకొచ్చి తన కోరికల్ని అదుపు చేయాలను కున్నాడు. ఎన్నో అవమానాలను ఓర్చి ఇంజనీరింగ్ పూర్తి చేశాడు. కానీ అప్పుడప్పుడూ ఊరి చివరికెళ్లి గాజులు, పూలు, చీరకట్టుకుని ఆడవాళ్లలా నడుస్తూ తను ఎలా జీవించాలనుకుంటున్నాడో అలా కొంతసేపు గడిపి ఇంటికి వచ్చేవాడు. ఎలాగైనా ఉద్యోగం సంపాదించుకుని, తన తల్లిని బాగా చూసుకోవాలన్న దృఢసంకల్పంతో మగాడిగా జీవిస్తూ ఎన్నో కంపెనీలు తిరిగేవాడు. కానీ ఎంతో ఆశతో ఎదురుచూసిన ఉద్యోగం రాకుండా పోతోంది. ఇప్పుడు అమ్మకి ఎలా ముఖం చూపించాలి? ఉద్యోగం ఏమయిందని అడిగితే ఏమని చెప్పాలి? ఆలోచిస్తూ... నడుస్తుంటే ఇంతలో ఎదురుగా కారు హారన్! మోగడంతో ఒక్కసారిగా ఆలోచనల్నుండి బయటపడ్డాడు. కారు డ్రైవరు కోపంగా తిడుతుంటే అతనికి సారీ చెప్పి రోడ్డుపక్కకెళ్లి నిలబడ్డాడు. ఇంతలో ఒక దుకాణం దగ్గరికి ఒక హిజ్రా వచ్చి, యజమానిని డబ్బులు అడగడం చూశాడు. ఆమె దగ్గరకు వెళ్లాడు. ఆమెతో మాటలు కలుపుతూ.. "అక్కా! ఇలా షాపుల వెంట అడుక్కోవడమేనా! మనలాంటి వారికి గౌరవంగా జీవించే అవకాశం లేదా?. ఇలా అడుక్కోవడం తప్పితే మంచి ఉద్యగం చేయలేమా" అని కళ్యాణ్ తనలోని ఆవేదనను వ్యక్తం చేశాడు. అతనిని ఎగాదిగా చూసిన ఆమెకు మగాడిగా కనిపిస్తున్న అతను కూడా తనలాంటి ఒక హిజ్రా అని గుర్తుపట్టడానికి ఎంతో సమయం పట్టలేదు. నీపేరేంటి ? అని హిజ్రా అడగడంతో 'కళ్యాణ్' కానీ కళ్యాణి అని పిలిస్తే చాలా ఇష్టం అని సమాధాన మిచ్చాడు. ఆమె కళ్యాణ్‌తో "చూడమ్మా కళ్యాణి ఈ సమజానికి భయపడో, నీ కుటుంబానికి లోబడో, నీ ఆలోచనలకూ, కోరికలకూ తగ్గట్టు జీవించలేకపోతున్నావని అర్థమైంది. మనము ఇలా అటూ ఇటూ కానట్టు పుట్టడం మనం చేసిన నేరంగా చూస్తోందీ సమాజం. స్త్రీలలాగా, పురుషుల్లాగా మనం కూడా మనుషులమే అన్న విషయాన్ని మరిచిపోయి అతిహీనంగా చూస్తున్నారు. ప్రభుత్వాలు కూడా కనీసం పట్టించుకోవడం లేదు. కుటుంబ సభ్యులు మనలాంటి వాళ్ళని ఇంటి నుంచి బయటకు నెట్టేసి, వెలివేసిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో మనం, జానెడు పొట్ట నింపుకోవడం కోసం అడుక్కోవడమో, ఒళ్లమ్ముకోవడమో చేయాలి తప్ప మనకు ఉద్యోగాలు ఎవరిస్తారు?" అంటూ కళ్యాణ్ తలపై చేయి ఆనించి వేరే దుకాణానికి వెళ్ళిపోయింది. ఆ హిజ్రా అలా వెళ్తుంటే అటుగా చూస్తూ ఆమె కూడా బాగా చదువుకున్నదానిలా ఉందనుకున్నాడు. ఇలా సుడుసుడులుగా తిరుగుతున్న ఆలోచనలతో సాయంత్రానికి ఇంటికి చేరాడు. కాళ్లూ చేతులు కడుక్కున్నాక ఇంట్లోకి వచ్చి టీవీ పెట్టాడు. స్క్రోలింగ్‌లో డబ్బుల కోసం అతి కిరాతకంగా హిజ్రా హత్య.. పరారీలో దుండగులు.. ఇది చూసిన కళ్యాణ్‌కి ఒక్కసారిగా షాక్‌కు గురయ్యాడు. కొంతసేపటికి తల్లి పిలుపుతో తేరుకొని ఆకలి లేదని చెప్పి, ఆలోచనలో పడ్డాడు.

"తనలాంటి వాళ్ల పరిస్థితి ఇంతేనా? ఎందుకింత దుర్మార్గం? తనలాంటివాళ్లు చేసిన తప్పేంటి? ఆకలి, కోపం, బాధ అందరిలాగే తనకూ వుంటాయి కదా! గౌరవంగా బతకాలని వుంటుంది కదా! ఎందుకింతలా వెలివేసిందీ సమాజం. జానెడు పొట్ట నింపుకోవడం కోసం రైళ్లలోనూ, షాపుల్లోనూ అడుక్కుంటూ, సెక్స్‌వర్కర్‌గా దిగజారి, నిరంతరం అవమానాలకు, కొందరు హత్యలకు గురవుతూ, భద్రత లేని బతుకు బతక వలసిందేనా? లేదు! ఈ పరిస్థితి మారాలి. తామూ అందరిలాంటి మనుషులమే అన్న స్పృహ ఈ సమాజానికి రావాలి. తమకూ కొన్ని హక్కులు ఉంటాయిగదా?. వాటిని కాపాడే బాధ్యత కూడా ఈ సమాజానికి వుందని తెలియజేయాలి. తనలాంటి అభాగ్యులకు తానే గొంతు అవ్వాలి అనుకుంటూ అలుపెరుగని ఆలోచనతో రేపటి ఉదయం కోసం ఎదురు చూస్తూ వుండి పోయాడు కళ్యాణ్ కాదు కళ్యాణి. బెదిరింపులు, దౌర్జన్యాలు, అఘాయిత్యాలు ఇవన్నీ కూడా సమాజంలో ఉన్న లోపాలు. ఇవన్నీ సమూలంగా పోవాలంటే సమాజం మారాలి. అది జరగాలంటే తనలాంటి అభాగ్యులందరినీ ఐక్యం చేయాలి. మాపై జరుగుతున్న అన్యాయాన్ని, వివక్షతనూ పారద్రోలే విధంగా వీరందరిని సన్నద్ధం చేయాలి. పోరాటమే మార్గం! మరో దారిలేదు. ఇనాళ్లూ గుండెల్లో గూడుకట్టుకున్న కొండంత భారం దించినట్టు మనసు తేలికైంది...

కె. శారద

# అకాల వివాహం సర్వం నాశాయ!





"నిర్మలా! నీకింత చిన్నవయస్సులో, అర్థాంతంగా డిగ్రీ ఫస్ట్ ఇయర్‌లో ఉండగానే నాకిచ్చి పెళ్ళిచేశారు కదా! కారణం ఏమిటో? నీ కిష్టమై చేసుకున్నావా? లేక బలవంతంగా చేశారా ? బహుశా నువ్వు ఎక్కడో ఏదో పొరపాటు చేసుంటావని అనుకుంటున్నాను. నిజమేనా! అయినా నువ్వెందుకు నిజం చెబుతావులే నా పిచ్చిగానీ...!" నూతన వధువుతో భర్త నరేష్ అన్నాడు.

తను ఏమి విన్నదో అర్థం కాక అయోమయంగా చూసింది నిర్మల. అది మొదలు ఆమె మౌనాన్ని అర్థాంగీకారంగానే కాదు పూర్తి అంగీకారంగా భావించేవాడు నరేష్, ఆమెను తన అనుమానాగ్నితో కాల్చేయడం మొదలుపెట్టాడు. నిర్మలకు ఎదురుచెప్పడానికి కూడా అవకాశంలేకుండా పోయింది. పెళ్ళిలో అప్పగింతల కార్యక్రమం తరువాత అమ్మ చెప్పిన పద్ధతులన్నీ తూ.చా. తప్పకుండా పాటిస్తూనే వుంది అక్కడికీ. "కట్టు, బొట్టు, నడత, నడక అన్నీ సంప్రదాయ బద్ధంగానే వుంటున్నా కదా? ఇంకెందుకు నాకీ నరకం" అనుకునేది నిర్మల. అతి కొద్ది రోజుల్లోనే ఆమె జీవితంలోకి పొలం రూపంలో అల్లకల్లోలం రానే వచ్చింది. పెళ్ళిలో ఆమెకు పుట్టింటి వారు ఇచ్చిన ఎకరం పొలం తనకు రాసిమ్మని అడిగాడు నిర్మలతో నరేష్. అందుకామే అంగీకరించ లేదు. ఆ తరువాత నుంచీ భార్య ఇంట్లో వుంటే, తను పనిచేసే కళాశాల విద్యార్థుల వసతి గృహంలో నరేష్ వుండేవాడు. పండుగకు పుట్టింటికి వచ్చినపుడు ఇదంతా తల్లికి చెప్పి కన్నీరు పెట్టుకుంది నిర్మల. ఆమె తల్లిదండ్రులు, నరేష్ తల్లిదండ్రులను కలిసి పెద్ద మనుషుల సమక్షంలో చర్చలు జరిపారు. అందరి సలహాతో వేరు కాపురం పెట్టించారు. వారి కాపురం చక్క బడుతుందని ఆశించారు. కానీ నరేష్‌కు అప్పటి దాకా తల్లిదండ్రుల రూపాన వున్న కాస్త అడ్డం కూడా తొలగిపోయినట్లైంది. నిర్మలకు లోకంలో వున్న నరకాలన్నింటినీ అతి తక్కువ కాలంలోనే చూపించేశాడు. రాత్రి సమయాన చక్కగా అన్నం తిని కూర్చొని, తెల్లవారుజాము వరకూ ఆమెనూ, ఆమె తల్లిదండ్రులనూ, బంధువర్గాన్నీ నోటికొచ్చి నట్లు అసభ్యంగా తిట్టేవాడు. ఆమె వినలేక చెవులు మూసుకొని పడుకుంటే లేపి కూర్చోపెట్టి మరి వినిపించేవాడు. ఎప్పుడో వేకువ జామున అలసిపోయి, పడుకొని నిద్రపోయేవాడు హాయిగా. ఇదంతా నిర్మలకు నరకంగా వుండేది. ఆమె ఏడిస్తే హాయిగా చూడాలని నరేష్ చాలా ఆశ పడేవాడు. అదేమిటోగానీ ఆమెకు ఏడుపు వచ్చేది కాదు. ఆ తరువాత ఆమె సెల్లును చెక్ చేసే దశకు వచ్చాడు. అతడు ఆశించినవి ఏమీ దొరికేవి కావు. తనే తన ఫ్రెండ్స్‌తో ఆమె పేరిట చాటింగ్ చేసేవాడు. మనమిద్దరిమే ఇక్కడ వున్నాము. ఇంక ఎవరూ లేరు. నువ్వు ఎక్కడెక్కడకు వెళ్తున్నావో? నీకోసం ఎవరెవరు వస్తున్నారో? నాకు తెలియడం లేదు. నీకై నువ్వు వెళ్లిపోయే అవకాశం నేను ఇవ్వను. ఇంటికి తాళం వేసుకుని వెళ్తాను. మళ్లీ నేను వచ్చాకే తీస్తా అని తాళం వేసుకుని వెళ్ళేవాడు. ఇటువంటి హింసలు ఏ మాత్రం ఊహించలేదు, సరికదా, అమాయకత్వంతో నిర్మల అతని ఎదురించనూ లేదు. చిన్న వయస్సు కావడంతోపాటు, అవగాహన కూడా లేక ఆమె మౌనంగానే ఉండేది. అనుకోకుండా ఓ రోజు నిర్మల తల్లిదండ్రులు ఆమెను చూడటానికి వెళ్లారు. ఇంటికి తాళం వేసి వుండటంతో నిరాశపడ్డారు. తమ అల్లుడూ, కూతురూ ఎక్కడికెళ్లారని ఇంటి యజమానిని అడిగారు. నరేష్ గురించి

ఇంటి యజమాని వారికి వివరంగా చెప్పాడు. తాళం వేసిన ఇంటిలోపల వున్న వారి కూతురిని చూపించాడు. వారిద్దరికీ నోట మాట రాలేదు. అల్లుడు ఇంటికొచ్చాక అతనితో గొడవ పడ్డారు. కూతుర్ని తీసుకొని ఇంటికి వచ్చేశారు. ఏం చేస్తే తమ కూతురి కాపురం చక్కపడుతుందో అర్థం కాని పరిస్థితుల్లో కొట్టుమిట్టాడు తుండగా, తెలిసివాళ్లు ఇచ్చిన సలహా మేరకు, కూతురుని వెంటబెట్టుకుని కుటుంబ న్యాయ సలహా కేంద్రానికి వచ్చారు. వారి బాధంతా విని ఐద్వా బాధ్యులు నరేష్‌కు లేఖ పంపించారు తమను కలవమని. నరేష్ నుంచి ఎటువంటి స్పందనా లేదు. నరేష్ తల్లి దండ్రులకు ఫోను చేసినా ఫలితం లేకుండా పోయింది. ఎలాగో నరేష్ స్నేహితుడి ఫోను నంబరు తెలుసుకుని అతడి ద్వారా నరేష్‌కు వర్తమానం అందజేశారు. కానీ ప్రయోజనం లేదు. ఐద్వా బాధ్యుల్లో ఒకరు నిర్మలను వెంటపెట్టుకుని నరేష్ పనిచేసే కళాశాలకు వెళ్ళారు. అక్కడ కూడా నరేష్ కనిపించలేదు. నరేష్ స్నేహితుడే వీరితో మాట్లాడాడు. తాను ఏమీ చేయలేకపోతున్నానని చెప్పాడు. నరేష్ తరపున న్యాయవాదితో అతను ఫోనులో మాట్లాడాడు, ఎలాగైనా నరేష్‌ను తమ వద్దకు వచ్చేలా చూడమని అడిగారు ఐద్వా పెద్దలు. లాయరు మాట కూడా వినలేదు నరేష్. ఐద్వా అదాలత్‌కు తాను రాననీ, రమ్మని ఒత్తిడి చేస్తే, ఆత్మహత్య చేసుకుంటా నంటాననీ బెదిరించాడు. నిర్మల ఏం తప్పు చేసిందని ఆమె మీకు ఇష్టంలేదు" అనడిగితే నేను తనతో కాపురం చేయడం లేదని ఆమె పెద్దలందరికీ చెప్పింది. అందుకే ఆమె నాకు అక్కర్లేదు అన్నాడు. ఈ వితండవాదం ఎవరికీ అర్థం కాలేదు.

**"ఆడపిల్లకు పెళ్ళే ముఖ్యం - ఎంత త్వరగా చేస్తే అంత మంచిది. చదువుదేముంది పెళ్లయాకైనా చదువు కుంటుంది. పిల్లలు పుట్టాక కూడా డిగ్రీలు, పీజీలు చేసిన వాళ్లు ఎంతోమంది ఉన్నారని అనుకున్నారు మీరు. చదువుమానిపించి చేసిన పెళ్ళి ఏడాది తిరగకుండా ముక్కలైంది. మీలాగ అమ్మాయంటేనే బరువని ఎవరూ అనుకోకుండా మిగిలిన వారికయినా మీరు కనువిప్పు కలిగించండి. ఆగిపోయిన నిర్మల చదువు కొనసాగించేలా సాయపడండి. ఆమె కాళ్లపై ఆమె ఆర్థికంగా నిలదొక్కుకునేందుకు ఆసరా ఇవ్వండి. పెళ్ళి చేస్తే తల్లిదండ్రుల బాధ్యత తీరుతుంది, నిజమే కానీ ఆమె బాధ్యత పెరుగుతుంది. మీరు ఆమె మెడలో వేయించిన మూడుముళ్లు ఆమెకు మూడు జన్మలకు సరిపడేలా నరకాన్ని చూపించాయి.**

"ఏ కారణమూ లేకుండానే భార్యను అన్ని విధాలుగా అవమానించి దాంపత్య బంధాన్ని తెగొట్టుకున్నాడు నరేష్. తను ఒక మానిసిక రోగి. శాడిస్టు. కుటుంబ న్యాయ సలహా కేంద్రానికి వస్తే, కౌన్సెలింగ్ చేయించి అతని వైఖరి కొంతమేరయినా మార్చగలిగే వాళ్లం. ఇప్పుడు ఏమీ చేయలేం. మీరు వెళ్లి న్యాయపరంగా పోరాడండి. ఇంతకు మించి చేసేదేమీ లేదు" అన్నారు. ఐద్వా బాధ్యులు. "ఆడపిల్లకు పెళ్ళే ముఖ్యం - ఎంత త్వరగా చేస్తే అంత మంచిది. చదువుదేముంది పెళ్లయాకైనా చదువుకుంటుంది. పిల్లలు పుట్టాక కూడా డిగ్రీలు, పీజీలు చేసిన వాళ్లు ఎంతోమంది ఉన్నారని అనుకున్నారు మీరు. చదువుమానిపించి చేసిన పెళ్ళి ఏడాది తిరగకుండా ముక్కలైంది. మీలాగ అమ్మాయంటేనే బరువని ఎవరూ అనుకోకుండా మిగిలిన వారికయినా మీరు కనువిప్పు కలిగించండి. ఆగిపోయిన నిర్మల చదువు కొనసాగించేలా సాయపడండి. ఆమె కాళ్లపై ఆమె ఆర్థికంగా నిలదొక్కుకునేందుకు ఆసరా ఇవ్వండి. తొందరపడి ఒక మంచి అమ్మాయిని, మనసులేని మనిషికి జత చేసి ఆమె వ్యక్తిత్వాన్ని అతగాడి చేతుల్లో తేలికయ్యేల చేశారు. పెళ్ళి చేస్తే తల్లిదండ్రుల బాధ్యత తీరుతుంది, నిజమే కానీ ఆమె బాధ్యత పెరుగుతుంది. మీరు ఆమె మెడలో వేయించిన మూడుముళ్లు ఆమెకు మూడు జన్మలకు సరిపడేలా నరకాన్ని చూపించాయి. మీరు చట్టపరంగా వెళ్లి అతనికి శిక్షపడేలా చూడండి. మీకు మా సహాయం ఎల్లవేళలా వుంటుంది" వారికి చెప్పి పంపించారు ఐద్వా బాధ్యులు.



# కుటుంబం ... సొంత ఆస్తి రాజ్యాల ఆవిర్భావం

మార్క్స్ ఎంగెల్స్ రచించిన 'కుటుంబము- సొంత ఆస్తి - రాజ్యాల ఆవిర్భావం' మహిళల పరాధీనతకు ఏ పరిస్థితులు దారితీశాయో శాస్త్రీయంగా వివరిస్తుంది. మహిళా సమస్యల పరిష్కారం పట్ల ఆసక్తి ఉన్నవాళ్లు ఈ పుస్తకాన్ని విధిగా చదవాలి. ఆదిమానవుడి అవతరణ నుంచి నాగరీకుడి ఆవిర్భావం వరకూ వేలాది సంవత్సరాలు చరిత్రలో కుటుంబ రూపాల గురించి తెలిపారు. గణాలు, సోదర కూటములు, తెగలు, సొంత ఆస్తి ఏర్పడడం, వర్గాలు, రాజ్యము ఉనికిలోకి రావడం, తల్లి హక్కు క్షీణత, పురుష ఆధిపత్యం నెలకొనడం, మానవ జాతి అభివృద్ధి క్రమంలో వివిధ దశలను సమగ్రంగానూ, శాస్త్రీయంగానూ వివరించారు. ఈ పుస్తకాన్ని గురించి కామ్రేడ్ లెనిన్ – "ఈ గ్రంథంలో ఉన్న ప్రతి వాక్యమూ ఆషామాషీగా కాకుండా అఖండమైన చారిత్రిక, రాజకీయ విషయాల ఆధారంగా ఎంగెల్స్ రాశాడని మనం అంగీకరించవచ్చు" అంటారు. ప్రాచీన గ్రీకు, రోమ్, జర్మన్ చరిత్రలో అపరిష్కృతంగా ఉన్న అతి ముఖ్యమైన సమస్యలకు సమాధానాలు ఉత్తర అమెరికాలోని రెడ్ ఇండియన్లలో పరిశోధన చేసి, మోర్గాన్ కనుగొన్నాడు. మానవుల ఆధిక్యత ఆహార ఉత్పత్తిలో వారికుండే నైపుణ్యము మీద ఆధారపడి ఉండేది అంటారు మోర్గాన్. పరస్పర సహకారంతో జీవిస్తున్న మానవులలో వర్గ విభేదాలు ఏర్పడి దోపిడీ వ్యవస్థను సృష్టించిన ఉత్పత్తి క్రమం, అందుకు అనుగుణమైన కుటుంబం – రాజ్య నిర్మాణం గురించి అద్భుతమైన విశ్లేషణ ఈ పుస్తకంలో మనకు లభిస్తుంది. దోపిడీ లేని సమాజాన్ని సృష్టించడం తప్పదని చరిత్ర క్రమాన్ని విశ్లేషించిన ఎంగెల్స్ నిర్ధారణకు వచ్చారు. ఆటవిక దశలో మానవజాతి శైశవ దశలో ఉండి, అరణ్యాలలో నివసిస్తూ, పళ్ళు, కాయలు, దుంపలు తింటూ బతికింది. నిప్పు



వినియోగాన్ని తెలుసుకోవడం ద్వారా చేపలు, పీతలు, నత్తలు మొదలైన జలచరాలను తినటం నేర్చుకున్నారు. ఆ తర్వాత విల్లు, అంబులను కనుక్కోవటం వారి జీవితాన్ని తీవ్రంగా ప్రభావితం చేసింది. జంతు దశ నుండి బయటపడ్డ మానవులకు కుటుంబం గురించి తెలియదు. ఈ దశలో స్వేచ్ఛా లైంగిక సంబంధాలు ఉండేవి. కాలక్రమేణా గుంపులోని తరాలను బట్టి లైంగిక సంబంధాలు విభజితమయినాయి. ఈ కుటుంబాన్ని రక్త సంబంధీకుల కుటుంబం అంటారు.

తల్లిదండ్రులకూ, సంతానానికీ మధ్య, సోదరీ సోదరుల మధ్య లైంగిక సంబంధాలు నిషేధం విధించిన తెగలలో అభివృద్ధి వేగంగా జరిగింది. అనాగరిక యుగంలో ఉన్న ప్రజలలో గణాలు పునాదిగా ఉన్నాయి.

నూతన వ్యవస్థలో కుటుంబంలోని అక్క చెల్లెళ్లు ఒక కుటుంబానికి కేంద్రంగానూ, అన్నదమ్ములు మరో కుటుంబానికి కేంద్రంగా ఉంటారు. దీనిని మోర్గాన్ పునలువాన్ కుటుంబము అన్నారు. ఈ పద్ధతి అమల్లోకి వచ్చేటప్పటికీ మానవ సమాజం స్థిర నివాసాలు ఏర్పరచుకుంది. గుంపు పెళ్లిళ్లు అంతకంతకూ అసంభవం అయిపోతాయి. ఈ పద్ధతికి బదులు జంట కుటుంబం అమల్లోకి వచ్చింది. ఈ దశలో మగవాడు ఒక మహిళతో జీవిస్తాడు. ఎవరికి ఇష్టం లేకపోయినా వివాహబంధాన్ని విడగొట్టు కోవచ్చు. పిల్లలు మాత్రం తల్లికే చెందుతారు. రక్త సంబంధం లేని గణాల మధ్య వివాహం వలన శారీరకంగానూ, మానసికం గానూ బలిష్టమైన సంతానం కలగసాగింది. వారి మెదడు విస్తరించింది. ఈ వ్యవస్థలో స్త్రీలు ఇంచుమించు అందరూ ఒకే గణానికి చెందిన వారు. భర్తలు వేరే గణం నుంచి వస్తారు. మహిళల నాయకత్వం సర్వసాధారణం.

జంతువులను మచ్చిక చేసుకోవడం వల్ల గోపాల జాతులు బాగా అభివృద్ధి చెందాయి. ఈ మందలకు పురుషులు యజమానులయ్యారు. జంతువుల మందలు పెరగడం, వ్యవసాయం, లోహాలు కరిగించి పరికరాలు చేసుకోవడం, చేతివృత్తులు అభివృద్ధి కావడం వల్ల శ్రామికుల అవసరం

**ఆధునిక యుగంలో పెద్ద పెద్ద పరిశ్రమలు వచ్చాక ఆమె తిరిగి సాంఘిక వుత్పత్తిలోకి అడుగుపెట్టింది. కుటుంబాల్లో ఆర్థిక సమపార్జనలో ఇద్దరూ సమానమే. రానున్న సామాజిక విప్లవం వారసత్వంగా సంక్రమించిన ఆస్తిలో ఎక్కువ భాగాన్ని సామాజిక ఆస్తిగా మార్చి వేస్తే, వారసత్వ విషయానికి సంబంధించిన తాపత్రయం తగ్గిపోతుంది. రోజు కూలీలు, కార్మికులు, శరీరాన్ని అమ్ముకునే స్త్రీలు అదృశ్యం అవుతారు. పిల్లల పెంపకం, చదువు సామాజిక ధర్మం అవుతాయి. అప్పుడు పురుషులు కూడా ఏక పత్నీవ్రతులు అవుతారు. అప్పుడు నిజమైన దంపతీ వివాహ కుటుంబం అమల్లోకి వస్తుంది.**

పెరిగింది. మందలు పెరిగినంత వేగంగా మంధి పెరగరు. తమ చేతిలో ఓడిపోయిన శత్రువులను తొలుత చంపేసేవారు. ఇప్పుడు వారిని బానిసలుగా వుపయోగించుకోవటం ప్రారంభమయింది. స్త్రీ – పురుషుల మధ్య మొదటి శ్రమ విభజన జరిగింది. దాని ప్రకారం వేట, అందుకు అవసరమైన పరికరాల సమీకరణ మగవారి బాధ్యత. అవి అతని సొంతం. పశువులకూ, బానిసలకూ పురుషులు యజమానులు అయ్యారు. ఆనాటి ఆచారం ప్రకారం తండ్రి ఆస్తికి పిల్లలు వారసులు కారు. సంపదలు పెరిగేకొద్దీ కుటుంబంలో పురుషుల ప్రాముఖ్యత పెరిగింది. గత ఆచారానికి విరుద్ధంగా తన సంతానానికి వారసత్వాన్ని కలిగించే ఆలోచన పురుషుడికి కలిగింది. తల్లి హక్కును తోసి వృచ్చారు. స్త్రీ జాతికి ఇది చారిత్రక పరాజయం. అనాగరిక యుగపు పై దశలో జంట పెళ్లి, దంపతీ వివాహానికి నడుమ బానిస స్త్రీలపై మగవారికి సంపూర్ణ అధికారం రావటంతో బహు భార్యత్వం వచ్చింది. సంపద మగవాళ్ళ చేతికి చేరడం, దానిని తన పిల్లలకు సంక్రమించడం నుంచీ దంపతీ వివాహము అమల్లోకి వచ్చింది. స్త్రీ ప్రతివ్రతగా ఉండడం అవసరం, మగవాడికి ఆ అవసరం లేదు. గృహ నిర్వహణలో సాంఘిక స్వభవం పోయింది. ఆమె దాసిగా మారింది.

ఆధునిక యుగంలో పెద్ద పెద్ద పరిశ్రమలు వచ్చాక ఆమె తిరిగి సాంఘిక ఉత్పత్తిలోకి అడుగుపెట్టింది. కుటుంబాల్లో ఆర్థిక సమపార్జనలో ఇద్దరూ సమానమే. రానున్న సామాజిక విప్లవం వారసత్వంగా సంక్రమించిన ఆస్తిలో ఎక్కువ భాగాన్ని సామాజిక ఆస్తిగా మార్చి వేస్తే, వారసత్వ విషయానికి సంబంధించిన తాపత్రయం తగ్గిపోతుంది. రోజు కూలీలు, కార్మికులు, శరీరాన్ని అమ్ముకునే స్త్రీలు అదృశ్యం అవుతారు. పిల్లల పెంపకం, చదువు సామాజిక ధర్మం అవుతాయి. అప్పుడు పురుషులు కూడా ఏక పత్నీవ్రతులు అవుతారు. అప్పుడు నిజమైన దంపతీ వివాహం (సమాన సంబంధాలు) అమల్లోకి వస్తుంది.

**గణవ్యవస్థ :**

ప్రాచీన కాలంలో గ్రీకులు, రోమనులలో ఉన్న మొత్తం సామాజిక నిర్మాణము గణము. సోదర కూటములు, తెగల రూపంలో కనబడుతుంది. సరిగ్గా ఇలాంటి వ్యవస్థే అమెరికా, ఇండియాలో కూడా ఉంది. నాగరికత లోకి అడుగు పెడుతున్న దశలో అనాగరిక తెగలన్నిటి లోనూ ఈ వ్యవస్థ సర్వసాధారణ మని నిరూపించాడు మోర్గాన్. దీనితో ప్రాచీన కాలపు గ్రీకు, రోమన్ చరిత్రలో ఇంతవరకూ కొరకరాని కొయ్యగా ఉన్న భాగాలు ఒకమాటు స్పష్టం అయ్యాయి. మోర్గాన్ అమెరికాలోని ఇరాక్యూ గణం నిర్మాణం గురించి వివరించాడు. గ్రీకు, రోమన్, జర్మన్ తెగల విషయాలను స్పష్టం చేయడం జరిగింది. అతి ప్రాచీనమయిన ఎథీనియన్ చట్టాలు గణము, తెగ మీదనే ఆధారపడి వున్నట్లు గ్రోతే చెప్పాడు. ప్రాచీన కాలపు గణ వ్యవస్థ పతనం, తండ్రి హక్కు ఏర్పడడం, పిల్లలకు తండ్రి సంపాదన వారసత్వంగా రావడం, అతని కుటుంబ ఆస్తి బాగా పోగు పడడం వలన గణము కన్నా కుటుంబం బలమైంది అయింది. ఖైదీలకు మాత్రమే పరిమితమైన బానిసత్వం క్రమముగా తెగలోని తోటి సభ్యులను బానిసలుగా చేసుకోవటంగా విస్తరించింది. పశువులను దోచుకోవడమే దాడుల ప్రధాన ఉద్దేశంగా మారింది. వంశాను క్రమముగా వస్తున్న కులీన వ్యవస్థ రాజరికానికి ప్రాతిపదిక ఏర్పాటు చేసింది. గతంలో ఎంతో చులకనగా చూసిన సొంత ఆస్తి పవిత్రమైందిగా స్థిరపడింది. మానవ సమాజ ప్రధాన గమ్యం ఆస్తి సంపాదనగా మారింది. ఆస్తిపర వర్గాలు – ఆస్తి లేని వర్గాలని దోచుకుని పాలించే హక్కును శాశ్వతం చేసే విధంగా రాజ్యం వునికిలోకి వచ్చింది. సామాజిక రాజకీయ వ్యవస్థలకు మూలమైన వర్గ వైషమ్యాలు ఏర్పడ్డాయి. ఎథేన్స్ వుచ్చదశలో వున్నప్పుడు స్త్రీలు, పిల్లలు కలిసి స్వతంత్రులు 90,000, బానిసలు 3,65,000 ఉండేవారు .పరాధీనులు 45000 వుండేవారు. ఈ లెక్కన చూస్తే ప్రతి స్వతంత్ర పౌరుడికి 18 మంది బానిసలు, ఇద్దరు పరాధీనులు ఉండేవారు. రోమన్, జర్మన్ గణ వ్యవస్థలు విచ్ఛిన్నమై రాజ్యాలు ఏర్పడిన తీరు కూడా ఈ పుస్తకంలో సవివరంగా వివరించాడు.

చారిత్రక అసమానతలు ఏర్పడడానికి కారణాలను, అందుకు మూలమైన ఉత్పత్తి పద్ధతులను, నిరంకుశమైన కుటుంబం, రాజ్యము ఏర్పడిన పద్ధతిని , ఆస్తి, వారసత్వం స్తిర పడిన పద్ధతిని అంతిమంగా ఉత్పత్తి సామాజికపరం కావడం ద్వారా రాజ్యాధికారం పతనం అవడాన్ని వివరించిన ఒక ప్రామాణిక గ్రంథం ఇది. స్త్రీ పురుషుల మధ్య పేమ పూర్వకమైన సంబంధాలు ఏర్పడడాన్ని ఎంగిల్స్ ఆశాజనకంగా ఆవిష్కరించారు.

తాటికోల పద్మావతి, 9441753376

# దీపధారి – దారి






ఉదయం 10 గంటలు. రోగులతో ప్రభుత్వ ఆసుపత్రి కిటకిటలాడుతోంది. గది లోపల డాక్టర్ అగర్వాల్ ఒక్కొక్క రోగినే ఓపికగా పరీక్ష చేసి, మందులు రాసిస్తున్నాడు. అతనికి వైద్యుడిగా మంచి పేరుంది.

ఆ రోజు వచ్చిన రోగులందరినీ ఓపికగా చూసి పంపిన తర్వాత సిస్టర్ వచ్చి "సార్ మీకోసం తండ్రీ, కూతురు మాదిరిగా వున్న ఇద్దరు ఎదురు చూస్తున్నారు" చెప్పింది.

"సరే పంపు" చెప్పాడు డాక్టర్ అగర్వాల్.

వచ్చినవాళ్లు తండ్రీకూతుళ్ల మాదిరిగా ఉన్నారు. అతనికి నలభై ఏళ్ళుంటాయి. పక్కనే పదేళ్ళ పిల్లాడు.

వాళ్లు కూర్చున్న తర్వాత డాక్టరు అడిగాడు "చెప్పండి"

"నా కూతురయ్యా. పుట్టినపుడు బాగానే ఉంది. నిజం చెప్పాలంటే తాను అబ్బాయి నను కొంటున్నది. బడికెళ్లినా, ఇంట్లో వున్నా అబ్బాయిల్లాగా లాగూ చొక్కాలు వేసుకుంటుంది. జడ వేసుకోవడం ఇష్టం లేదంటూ తరచూ జుట్టు కత్తిరించు కుంటుంది." చెప్పాడు తండ్రి.

"సరే మీరలా బయట కూర్చోండి" తండ్రితో చెప్పాడు. బాలికను తెర వెనుక బల్లమీద పడుకో బెట్టించి పరీంక్షించాడు. ఇటు ఆడా కాకుండా మగా కాకుండా వుంది. అదే విషయాన్ని తండ్రితో చెప్పాడు. "దీనికి మందులేమీ లేవు. చేయగలిగిందేమీ లేదు"

"మా ఖర్మ బాబూ! దీన్నెలా వదిలించుకోవాలా అని చూస్తున్నాం. మాకే ఇల్లు గడవడం కష్టంగా ఉంది. దీన్ని కూడా ఎక్కడ పోషిస్తాం." అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

"ఇలా పుట్టాలని ఆ పిల్లేమన్నా కోరుకుందా! మీరు తొందరపడి ఎలాంటి నిర్ణయం తీసుకోకండి. నేను వారం రోజుల్లో ఆ పిల్లకో మార్గం చూపించేందుకు ప్రయత్నిస్తా" హామీ ఇచ్చాడు డాక్టర్.

"సరే బాబూ, అంతా మీ దయ" అంటూ వెళ్ళిపోయాడు. నిన్నటి సంఘటనలన్నీ మనసులో మెదులుతున్నాయి. వాటిని తలుచుకోగానే గుండె బరువెక్కింది.

నిన్న సాయంత్రం కారులో భార్యతో షాపింగుకని బయలుదేరాడు. ఆభరణాల దుకాణంలో పెద్దగా జనం లేరు. సమయం రాత్రి ఏడు గంటలు. ఆభరణాలను ఒక్కొక్కటీ చూస్తున్నది సరళ. ఇంతలో ఇద్దరాడవాళ్ళు వచ్చారు. మంచి ఖరీదైన చెంకీల డిజైను చీరలు కట్టుకున్నారు. రవికలు మాత్రం ఫ్యాషన్‌గా వున్నాయి. పెద్ద జడలు. అసలు జుట్టో, సవరమో తెలియటం లేదు. తలలో పూల దండలు వేలాడుతున్నాయి. వాళ్ళ ముఖాల్లో తేడా కనిపిస్తున్నది.

చప్పట్లు కొట్టుకుంటూ లోపలికొచ్చారు. గల్లా పెట్టె దగ్గర కూర్చున్న వ్యక్తిని ఏదో అడిగినట్లున్నారు. ఆయన లేవంటూ చేతులు తిప్పాడు. పది నిమిషాలు గడిచినా వాళ్ళు కదలలేదు. వాళ్ళేం చేస్తారోనని ఆసక్తిగా చూస్తున్నాడు డాక్టర్ అగర్వాల్.

ఇద్దరు కస్టమర్ల జేబులో చేతులు పెట్టి నోట్లకట్ట బయటికి తీసి పది రూపాయలు మాత్రమే తీసుకున్నారు. మిగతా నగదును తిరిగివాళ్ళ జేబుల్లోనే పెట్టారు.

"వీళ్ళకి రోజూ ఇదో పనై పోతున్నది. దర్జాగా రావటం, డబ్బులు లాక్కు పోవడం. ప్రతిరోజూ ఎవరిస్తారు? వీళ్ళ బాబు సొమ్ము ఇక్కడేమైనా దాచి పెట్టారా? నాలుగు రోజులు ఇవ్వకుండా వుంటే వాళ్ళే వెళ్ళి పోతారు." క్యాషియరు మొండిగా కూర్చున్నాడు.

క్యాషియరు తీరు వాళ్ళిద్దరికీ కోపం తెప్పించింది. గబగబా గల్లాపెట్టె దగ్గరకొచ్చారు. క్యాషియరుతోపాటు తమను అడ్డుకుంటున్న మేనేజరును ఒకరు వెనక్కు నెట్టి పట్టుకోగా,

రెండో ఆమె వంద రూపాయల నోటు మాత్రమే తీసుకొంది. ఆ వెంటనే ఇద్దరూ చక్కా వెళ్లిపోయారు.

"చూశారా! వాళ్ళకెంత పొగరో! బలవంతంగా గల్లా పెట్టెలో డబ్బులు తీసుకొని వెళ్ళారు. దొంగతనం చేశారని వాళ్ళమీద పోలీసులకు కంప్లయింట్ ఇవ్వక పోతే ముందు ముందు చెలరేగిపోరూ!" అంటూ ఫోను రిసీవర్ అందుకొన్నాడు.

డాక్టర్ అగర్వాల్ అడ్డుపడ్డాడు. "నేనిలా అంటున్నానని అనుకోవద్దు. వాళ్ళు తీసుకెళ్ళింది కేవలం వంద రూపాయలే. మీరే పదో, పరకో ఇచ్చివుంటే ఇంతదాకా వచ్చేది కాదు. సమాజంలో ఆదరించేవారు లేక, వాళ్ళెలాంటి అవస్థలు పడుతున్నారో? ఇటు ఆడా కాక, మగా కాక బయటికి రావాలంటేనే భయపడుతున్నారు. జన్యు కారణాల వల్ల ఇలా పుడతారు. వాళ్ళని చూసి అవహేళన చేసే వాళ్ళేగానీ, వాళ్ళూ మనుషులేనని గుర్తించరు." అక్కడున్న వాళ్లందరి ముఖాల్లోకి చూస్తూ నెమ్మదిగా వివరించాడు అగర్వాల్.

"ఇలా ఎంత కాలం సహిస్తామండీ! రోజూ వచ్చి డబ్బులు పట్టుకెళ్తారు. ఇవ్వకపోతే బలవంతంగానైనా తీసుకెళ్తారు. వీళ్ళ కోసం ప్రభుత్వాలు ఏమీ చెయ్యలేవా?"

వాళ్లకీ కొన్ని హక్కులుంటాయి. అడపాదడపా పోరాటాలతో ప్రభుత్వాల మీద ఒత్తిడి చేస్తున్నారు. వీళ్ళందరికీ ఇళ్ళ స్థలాలు కేటాయించాలి. వుచితంగా చదువులు చెప్పించాలి. వృత్తి విద్యలు నేర్పిస్తే వాళ్ళ కాళ్ళ మీద వాళ్ళు నిలబడగలుగుతారు."

"మీరు చెప్పింది బాగానే ఉంది. అమలు పరచటమే కష్టం." అన్నాడు క్యాషియరు.

"కేవలం ప్రభుత్వం మీదనే ఆధార పడకుండా పౌర సమాజం కూడా ఏదో ఒకటి ప్రయత్నించాలి. వాళ్ళనీ మనుషుల్లాగ గుర్తించాలి" ఆవేశంగా చెప్పాడు డాక్టర్ అగర్వాల్.

"సరే, మీరేమైనా ప్రయత్నాలు చేస్తే చెప్పండి. నేనూ భాగస్వామినవుతాను" అన్నాడు మేనేజర్.

"ఓ తప్పకుండా! మనలాంటి వాళ్ళంతా ఏకమైతే వాళ్ళకో కొత్త జీవితాన్ని ప్రసాదించిన వాళ్ళమవుతాము" జవాబిచ్చాడు డాక్టరు.

వాళ్లకేమైనా చెయ్యాలనే ఉద్దేశం బలంగా నాటుకొని పోయింది అగర్వాల్ మదిలో అప్పుడే. "వాళ్ళకెవరూ వుద్యోగా లివ్వరు. సంపాదన లేక ఇలా డబ్బులకోసం దుకాణాల వెంట తిరుగుతారు." మనస్సులో అనుకున్నాడు. ఆ మధ్య రైల్లో జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది. కొంతమంది ట్రాన్స్ జెండర్లు రైల్లో అందరి దగ్గరా డబ్బులడిగి తీసుకొంటున్నారు. ఒకతను ఇవ్వనన్నాడు. పర్సు లాక్కొని రైల్లోంచి కిందికి తోసేశారు అతన్ని. వాళ్ళని చిన్నచూపు చూస్తున్నారన్న భావం వాళ్ళలో కసిని పెంచుతాయి. ఎంతకైనా తెగిస్తారు.

మార్కెట్లో కూరగాయల వ్యాపారుల దగ్గరికి వస్తారు. కూరల బుట్ట మీద చెయ్యి పెట్టి దీవిస్తారు. వాళ్ళలా చేస్తే మంచి లాభాలు వస్తాయని వ్యాపారుల నమ్మకం. వ్యాపారులు పదీ ఇరవై ఇచ్చి పంపుతారు. వాళ్ళ దీవెన చాలా మంచిదంటుం టారు.

శుభకార్యం జరుగుతుందని తెలిస్తే చాలు పదిమంది దాకా అక్కడ గుమిగూడ తారు, ఆటపాటలతో కాలక్షేపం చేసి డబ్బు తీసుకెళ్తారు.

ఆలోచన వచ్చిందే తడవు డాక్టర్ అగర్వాల్, కొంత మందిని సంప్రదించాడు. "తమరు చేస్తున్న మంచి పనికి మీ వెనుకే వుంటామండీ" హామీ ఇచ్చారు.

అదొక విశాలమైన ప్రాంగణం. డాక్టర్ అగర్వాల్‌తో పాటు పట్టణ ప్రముఖులలో అత్యధికులు అక్కడికి వచ్చారు. ముందుగా ప్రకటించిన ప్రకారం హిజ్రాలంతా అందంగా అలంకరించుకొని అక్కడికి చేరుకొన్నారు. వాళ్ళని చూసి కొందరు జాలి పడ్డారు. ఇటు ఆడా మగా కాక, పెళ్ళి, సంసారం, పిల్లలకు నోచుకోని వాళ్లతో జరుగుతోన్న సమావేశం అది.



అంతా మాట్లాడుకుంటున్నారు. పెద్దలు ఏంచెప్పబోతున్నారాని ఆతృతగా చూస్తున్నారు హిజ్రాలు.

డాక్టర్ అగర్వాల్ నిలబడి అందరినీ ఒకసారి పరికించి చూశాడు. "మిమ్మల్నందరినీ ఇక్కడికి ఎందుకు పిలిపించామో తెలుసను కుంటాను! మీ కోసం ఏమయినా చేయగలమా అని ఆలోచించేందుకే ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నాం. ఇక అసలు విషయానికొస్తే, మీరిలా పుట్టడం మీ తప్పు కాదు. మీ తల్లిదండ్రుల తప్పూకాదు.

**డాక్టర్ అగర్వాల్ నిలబడి అందరినీ ఒకసారి పరికించి చూశాడు. "మిమ్మల్నందరినీ ఇక్కడికి ఎందుకు పిలిపించామో తెలుసను కుంటాను! మీ కోసం ఏమయినా చేయగలమా అని ఆలోచించేందుకే ఈ సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నాం. ఇక అసలు విషయానికొస్తే, మీరిలా పుట్టడం మీ తప్పు కాదు. మీ తల్లిదండ్రుల తప్పూకాదు. జన్యులోపం వల్ల మీరిలా తయారయ్యారు. మీలో కొంతమంది సెక్స్ మార్పిడి కూడా చేయించుకున్నారు. పైకి ఎవరికీ చెప్పుకోలేక, సమాజంలో నిర్భయంగా తిరగలేక చావలేక బతుకున్నారు. బతుకుదెరువు కోసం బలవంతంగా డబ్బులు వసూలు చేస్తున్నారు. సమాజంలో కొంతమందికి ఈ తీరు నచ్చటం లేదు."**

జన్యులోపం వల్ల మీరిలా తయారయ్యారు. మీలో కొంతమంది సెక్స్ మార్పిడి కూడా చేయించుకున్నారు. పైకి ఎవరికీ చెప్పుకోలేక, సమాజంలో నిర్భయంగా తిరగలేక చావలేక బతుకున్నారు. బతుకుదెరువు కోసం బలవంతంగా డబ్బులు వసూలు చేస్తున్నారు. సమాజంలో కొంతమందికి ఈ తీరు నచ్చటం లేదు."

"అయితే మమ్మెల్నెలా బతకమంటారో చెప్పండి'' హిజ్రా హేమ అగర్వాల్ వుపాన్యాసానికి అడ్డొచ్చి బిగ్గరగా ప్రశ్నించింది.

''నిజమే! మీరూ అందరిలాంటి మనుషులేనని సమాజం గుర్తించాలి. అందుకు మీరంతా స్వతంత్రంగా బతకటం కోసం మీకు చదువు కావాలి. అందుకుగాను పాఠశాలలు ఏర్పాటు చేశాం. మీరు అక్కడ చదువుకోవచ్చు. మీకిష్టమైన చేతి వృత్తులు నేర్చుకొని మీ కాళ్ళమీద మీరు నిలబడవచ్చు" అందరి వైపూ చూశాడు.

హర్షధ్వానాలు మారుమోగాయి. అగర్వాల్ మళ్లీ మాట్లాడటం ప్రారంభించారు. "మీరు కష్టపడటం నేర్చుకొన్నాక వీధుల వెంట, దుకాణాల వెంట తిరిగి డబ్బులడగాల్సిన పనిలేదు. మీలో చైతన్యం రావాలి. నిరాశా, నిస్పృహలతో బతక్కూడదు. ఆత్మస్థైర్యాన్ని నింపుకోండి. మేమెందుకూ పనికిరాని వాళ్ళమనే భావన రానీయకండి. మీరంతా మేము చెప్పినట్లు చేయటానికి ఇష్టపడి నట్లయితే ఇక్కడకొచ్చి ఈ పత్రాల మీద సంతకాలు చేయండి" అంటూ కొన్ని పత్రాలు చూపించారు అగర్వాల్.

"మేమంటే మేము" అంటూ సంతకాలు చేశారు. ఆ పూట అందరికీ అక్కడే భోజనాలు ఏర్పాట్లు చేశారు.

అగర్వాల్ ఆధ్వర్యంలో ప్రారంభించ దలచిన సంస్థకు 'మేము సైతం' అని పేరు పెట్టారు. ట్రాన్స్ జెండర్లకి ఆ సంస్థ గురించి వివరంగా చెప్పారు. ఆయన ఆధ్వర్యంలో హిజ్రాలకు అవయవ మార్పిడి ఉచిత శిబిరం జరిగింది. మేము సైతం సంస్థను ప్రారంభించిన మొదట్లో చాలా మంది చేరారు. వాళ్ళకి నచ్చిన కోర్సులు నేర్పించేందుకు ఉపాధ్యాయుల్ని ఏర్పాటు చేశారు. దర్జీ పని, చెప్పులు తయారీ, ఎంబ్రాయిడరీ, పచ్చళ్ళు తయారు చేయటం ఇలా పనులతో పాటు కొందరు కేవలం చదువుకొనే పనిలో పడ్డారు. అదనంగా కంప్యూటర్ కోర్సులను కూడా నేర్చు కుంటున్నారు. గతంలో ఓసారి అగర్వాల్ ఆసుపత్రికి వచ్చినమ్మాయి కమలని తండ్రి మళ్ళీ తీసుకొచ్చాడు. "బాబుగారూ, ఈ పిల్లని మీ ఇంట్లో ఏదైనా పనికి పెట్టుకోండయ్యా" అంటూ ప్రాధేయపడ్డాడు. ఇదీ ఒకందుకు మంచిదేనని అగర్వాల్ తనింట్లోనే పనికి కుదిర్చాడు.

ఏడాది తిరిగేసరికల్లా హిజ్రాలలో మంచి మార్పు కనపడుతోంది. స్వచ్ఛంద సంస్థలన్నీ అగర్వాల్‌ని అభినందించాయి. సమాజం పట్టించుకోని హిజ్రాలను ఓ దోవలో పెట్టినందుకు ఆనందించి, తామూ చేయూత ఇస్తామంటూ పలువురు ఆసక్తి చూపించారు.

విద్య నేర్చుకొన్న వాళ్లు అక్కడే వుండిపోకుండా ఉద్యోగం వెతుక్కుంటూ వెళ్లి పోతున్నారు. ఉపాధి కోర్సులు నేర్చుకొన్న వాళ్లు స్వయం పథకాలు ఏర్పాటు చేసుకుంటున్నారు. దీనివల్ల వాళ్ళవాళ్ళ తల్లి దండ్రులకూ సంతోషంగా ఉంది.

హిజ్రాల జీవితాల్లో కొత్త వెలుగులు నింపాలని కంకణం కట్టుకొన్న అగర్వాల్ ఆశయం నెరవేరింది. ఎవరికీ ఎటువంటి కష్టం కలుగకుండా వాళ్ళకో కొత్తదారి చూపించినందుకు ఇటు ప్రభుత్వాలు, అటు ప్రైవేట్ సంస్థలు పొగడ్తలతో ముంచెత్తారు.

"యస్.. కరెక్ట్.. నేననుకొన్నది సాధించాను. నాకిప్పుడు ఎంతో గర్వంగా ఉంది" అంటూ అగర్వాల్ కూడా పొంగిపోయాడు.

అర్ధరాత్రి సమయం. అగర్వాల్‌కు మెలకువ వచ్చింది. కల చెదిరింది. గడియారం 12.26 గంటల సమయం చూపింది. అప్పటి దాకా తాను కన్న కలను అగర్వాల్ నెమరేసుకున్నాడు. ఆనందం భవిష్యత్తులో తాను సాధించబోయే విజయాలు ముందే గోచరించటంతో మనసు ఉక్కిరిబిక్కిరి అయింది.

కల తన కర్తవ్యాన్ని బోధించింది. చేయవలసిన కార్యక్రమాన్ని తెలియచెప్పింది. తన కలను నిజం చేయాలని అప్పుడే నిశ్చయానికి వచ్చాడు అగర్వాల్. హిజ్రాల కోసం కొత్త మార్గాన్ని చూపేందుకుగాను అప్పటికప్పుడే ప్రణాళిక రాయాలనుకున్నాడు. లేచి టేబులు ముందుకు వెళ్లి డైరీ తీసి రాయటం ప్రారంభించాడు అగర్వాల్.

తూర్పు దిక్కు నుంచి అరుణ కిరణాలు లోకాన్ని నిద్ర లేపుతున్న వేళ ప్రణాళిక రూపకల్పన పూర్తయింది. అగర్వాల్ హిజ్రాల కోసం ప్రారంభించదలచిన వివిధ కార్యక్రమా లను వెంటనే ప్రారంభించాలన్న తపన ఆయనను ఒక్క పరి నిలవనీయటం లేదు.

✷

# మనం చాలా మారాలి !

ఆంగ్ల మూలం : **పేరి మహేశ్వర్**

మనం దేవాలయాలు నిర్మించాం
మసీదులు కట్టాం విగ్రహాలు పెట్టాం
వీధి వీధినా చర్చిలు వర్ధిల్లుతున్నాయి
కానీ ఆసుపత్రుల్ని మరిచిపొయ్యాం
ఇప్పుడన్నీ మూతబడ్డాయి
ఆసుపత్రులు తప్ప




మనం పండితుల్ని గౌరవించాం
మౌల్వీల్ని కౌగిలించాం
స్వాముల్ని సేవించాం
ఫాస్టర్లను ప్రేమించాం
కానీ వైద్యులను మరచిపొయ్యాం
ఇప్పుడెవ్వరూ కనపడ్డంలేదు
వైద్యులు తప్ప

మనం సంస్కృతి కోసం శివాలెత్తాం
సంప్రదాయాల కోసం జుట్లు
పట్టుకొన్నాం
కులాల కోసం కుమ్ములాడుకొన్నాం
కానీ సైన్సును మరిచిపొయ్యాం
ఇప్పుడేవీ కాపాడ్డం లేదు,
సైన్సు తప్ప

ఇకనైనా పాఠాల్ని నేర్చుకొందాం
పద్ధతుల్ని మార్చుకొందాం

తిలారు అమల



# కరోనా తరహా వైరస్‌ల ప్రమాదాన్ని పట్టి చూపిన చిత్రం అవుట్ బ్రేక్

ప్రస్తుతం కరోనా వైరస్ ప్రపంచం మొత్తాన్ని భయపెడుతోంది. ఇలాంటి పలు వైరస్‌లపై సినిమాలు తీయడం హాలీవుడ్‌కే చెల్లింది. ఇప్పటికే వాటిపై పలు చిత్రాలు వచ్చాయి. 1995లో 'అవుట్‌బ్రేక్' అనే సినిమాలో ఎబోలా వైరస్ ఎటాక్ చేస్తే దాన్ని ఎదుర్కోవడానికి శాస్త్రవేత్తలు ఏమి చేశారనే కోణంలో దర్శకుడు పీటెర్ సన్ వెండితెరపై ఆవిష్కరించాడు. అదే ఏడాది '12 మంకీస్' అనే సినిమా వచ్చింది. దానిదీ వైరస్ కథా నేపథ్యమే! 2011లో 'కంటేజిన్' అనే చిత్రం వచ్చింది. ఇది ప్రస్తుతం కరోనా వైరస్‌కు డిటో. ఈ సినిమా చూస్తుంటే ప్రస్తుతం ప్రపంచం కళ్ళముందు కన్పిస్తుంది.

లాస్‌ఏంజెల్స్‌లో చిత్రీకరించిన ఈ సినిమా స్వైన్‌ఫ్లూ నేపథ్యంలో సాగుతుంది. ఆస్ట్రేలియా నుంచి కాలిఫోర్నియాకు బయలుదేరే విమానంలో యుక్త వయసులో వున్న ప్రయాణికుడు ఒకరు అనారోగ్యం పాలవుతాడు. నోటినుంచి రక్తం కక్కుకుని చనిపోతాడు. వెంటనే అత్యవసర వైద్యసిబ్బంది వచ్చి ప్రాణాంతకరమైన వైరస్ వ్యాధి అని నిర్ధారించి ప్రయాణికులను లాస్‌ఏంజెల్స్‌లో క్వారంటైన్ గృహానికి తరలిస్తారు. అందులో మైఖేల్ అనే ప్రయాణికుడు సామాన్ల గదిలో దాక్కుని క్వారంటైన్ నుంచి తప్పించు కుంటాడు. అతను స్థలాల, భవన నిర్మాణాల వ్యాపారి. తను తన కార్యక్రమాలను యథావిధిగా నిర్వహిస్తుంటాడు. అతనికీ క్రమేణా వైరస్ లక్షణాలు కన్పిస్తాయి. అయితే దాన్ని పెద్దగా పట్టించుకోడు. కానీ అతనిని కలిసిన వారందరికీ ఆ వైరస్‌ను దగ్గు రూపంలోనూ, కరెన్సీ రూపంలోనూ, షేక్ హ్యాండ్ రూపంలోనూ అంటగడతాడు. ఈలోగా ఓ ప్రయాణికుడు తప్పించుకున్న విషయం గుర్తించిన పోలీసులు మైఖేల్‌ను కనిపెట్టేసరికే అతను చనిపోతాడు. ఇక క్వారెంటైన్ గృహంలో వున్న ప్రయాణికు లందరికీ ఫ్లూ లక్షణాలు కనిపించేసరికి వైద్యం చేస్తుంటారు. అందులో ఓ మాఫియా నేత వుంటాడు. ఈ వైరస్‌కు మందు కనిపెట్టడానికి నెలలపాటు సమయం పడుతుందని శాస్త్రవేత్తలు చెప్పడంతో జాగ్రత్తగా ఉండాలని ప్రజలకు లాస్‌ఏంజెల్స్ మేయర్ పిలుపునిస్తాడు. వైరస్‌కు మందు కనిపెట్టే లోపలే రోగులు పదుల సంఖ్య నుంచి వేల మందికి పాకుతుంది. జపాన్‌లోనూ ఈ వైరస్ విస్తరిస్తుంది. కొందరు చనిపోతుంటారు. అలాంటి సమయంలో వైరస్ నివారణకు మందు కనిపెట్టారనీ, అది మిలియన్ డాలర్లలో ఉంటుందనీ.. ఇది బయట ఎక్కడా దొరకదనీ, దాన్ని క్వారంటైన్ గృహానికి తీసుకువస్తున్నారని శాస్త్రవేత్త ద్వారా తెలుసుకున్న మాఫియా డాన్ ఓ అర్ధరాత్రి తన గూండాలతో దాడిచేసి రెండు ట్రక్కుల మందుల్ని తస్కరిస్తాడు. ఆ తర్వాత ఇక్కడి రోగుల పరిస్థితి ఏమిటి? ఆ మాఫియాడాన్ ఆ మందుల్ని ఏం చేశాడు? చివరికి అతన్ని ఎలా పట్టుకున్నారు? అనేది ఆసక్తికరంగా చూపించారు.

ఈ చిత్రంలో చాలా విషయాలను దర్శకుడు చర్చించాడు. వైరస్ సోకిన వ్యక్తి గుండె ఎలా మారుతుందనేది చూపించాడు. ఇలాంటి విషయాలను ప్రజలను ఎడ్యుకేట్ చేసేవిధంగా ఉండాలే కానీ భయపెట్టే విధంగా మీడియా వ్యవహరించకూడదని సిటీ మేయర్ విలేకరుల సమావేశంలో సూచిస్తాడు. ఈ వైరస్ వల్ల ప్రతి ఒక్కరూ మాస్కులు ధరించాలనీ, భౌతిక దూరం పాటించాలనే విషయాలను కూడా చూపించారు. తన సెక్యూరిటీ కుమార్తెకు వైరస్ సోకితే సరైన సమయంలో చికిత్సకు సహకరించిన సిటీ మేయర్‌కు ఆ వ్యక్తి షేక్‌హ్యాండ్ ఇస్తుంటే.. లేదు... లేదు అంటూ

చేతులతో నమస్కరిస్తాడు. ఇలా ప్రతీదీ ప్రస్తుతం కరోనా వల్ల సమాజంలో జరుగుతున్న సంఘటల వలనే మనకు కన్పిస్తాయి. భవిష్యత్తు ఇలా వుండబోతుందనేది కొందరు చెప్పారని మనం వింటున్నాం. కానీ ప్రత్యక్షంగా సినిమానే తీసి చూపించారు. నిజంగా ఈ చిత్రం అందరూ చూడాల్సిందే. ప్రస్తుతం అవెజాన్ ప్రైమ్‌లో ఈ చిత్రం ప్రదర్శితమవుతోంది.

ఇదే కాకుండా ఇంకొన్ని రకాల వైరస్‌లపై చిత్రాలు కూడా వచ్చాయి. 2018లో కేరళలో నిఫా వైరస్‌పై 'వైరస్' అనే చిత్రం కూడా వచ్చింది. ఇది బెస్ట్ మెడికల్ థ్రిల్లర్‌గా మలయాళంలో నిలిచింది. 2013లో 'ఫ్లూ' చిత్రాన్ని దక్షిణ కొరియాలో పుట్టిన వైరస్ నేపథ్యంలో తెరకెక్కించారు. ఇంకా '28 డేస్ లేటర్', 'క్యారియర్స్' (2009), 'బ్లయిండ్‌నెస్' (2008) '93 డేస్' (2016) వంటి కొన్ని చిత్రాలు వచ్చాయి. ఓ వైరస్ ధాటికి తట్టుకోలేక ఓ సిటీ అంతా పిచ్చివాళ్ళ మయంగా మారిపోయి బయట నుంచి వచ్చిన మనుషుల్ని పీక్కుతినే తరహా చిత్రాలు కూడా వచ్చాయి. అలాగే ప్రకృతి వైపరీత్యం వస్తే 2012 యుగాంతం అనేది కూడా వచ్చింది. ఇలా కొన్ని చిత్రాలను ప్రేక్షకులను భయపెట్టే విధంగా చిత్రీకరించారన్న విమర్శలు వెల్లువెత్తాయి. కొన్ని చిత్రాల కథలు మాత్రం ప్రజలకు జాగ్రత్త చెప్పేవిగా ఉన్నాయి. సమస్య ఎప్పుడైనా, ఎలాగైనా రావచ్చు. ధైర్యంగా నిలబడితేనే పరిష్కారం లభిస్తుంది. దాని గురించి అవగాహన కలగాలి. సినిమాల్లో విలన్ ఎంత బలంగా వుంటే కథ అంత ఆకట్టుకునేలా ఉంటుంది. ప్రస్తుతం మనందరికీ విలన్ - కరోనా వైరస్. కాలక్రమంలో వైరస్ పేరు మారినా దాన్ని ధైర్యంగా ఎదుర్కొని అడ్డుకునేవారు శాస్త్రవేత్తలు, వైద్యులే. అందుకే వారందరికీ తన చిత్రాన్ని అంకితమిస్తున్నట్లు 'కంటేజిన్' అనే చిత్ర దర్శకుడు ముగింపు ఇస్తాడు. ఇలాంటి చిత్రాలు లాక్‌డౌన్ సమయంలో చూస్తే వాటిపై అవగాహన పెరుగుతుంది. ✸

**ఇలాంటి విషయాలను ప్రజలను ఎడ్యుకేట్ చేసేవిధంగా ఉండాలే కానీ భయపెట్టే విధంగా మీడియా వ్యవహరించకూడదని సిటీ మేయర్ విలేకరుల సమావేశంలో సూచిస్తాడు. ఈ వైరస్ వల్ల ప్రతి ఒక్కరూ మాస్కులు ధరించాలనీ, భౌతిక దూరం పాటించాలనే విషయాలను కూడా చూపించారు. తన సెక్యూరిటీ కుమార్తెకు వైరస్ సోకితే సరైన సమయంలో చికిత్సకు సహకరించిన సిటీ మేయర్‌కు ఆ వ్యక్తి షేక్‌హ్యాండ్ ఇస్తుంటే.. లేదు... లేదు అంటూ చేతులతో నమస్కరిస్తాడు. ఇలా ప్రతీదీ ప్రస్తుతం కరోనా వల్ల సమాజంలో జరుగుతున్న సంఘటల వలనే మనకు కన్పిస్తాయి.**

---

# వస్తున్నావా నువ్వు

మీరు నాకొక సాయం చెయ్యరూ
నేనీ స్వేచా గీతాలు పాడటానికి
సాయం చెయ్యరూ
ఎందుకంటే నేనింతదాకా చేసింది
విముక్తి గీతాలు పాడటమే
విముక్తి గీతాలు.
స్వేచా గీతాలు....బాబ్ మొర్లె

ఎలాంటి కాలం ఇది.
దేశ భక్తులు దేశ ద్రోహులుగా పిలువ బడే కాలం.
చుట్టూరు చీకటి నిండి వున్న కాలం.
వేల ముక్కలుగా చీలి శిథిల మవుతున్న కాలం.
చెట్టుకొకరు పుట్ట కొకరు అవుతున్న కాలం.
స్వేఛాగీతాలు పాడే నోటిని కుట్టేసే కాలం.
బృందగానాలు మాయమవుతున్న కాలం.

వాళ్ళు విశ్వరూపులై మనందరినీ కంబళిస్తున్న కాలం.
వాళ్ళు సూక్ష్మ జీవులై మనలను ఛిద్రం చేస్తున్న కాలం
వాళ్ళు హైనాలై మన ప్రాణాలను తోడేస్తున్న కాలం
వాళ్ళు మూడో అడుగుతో మనలని ఆక్రమిస్తున్న కాలం
మనలను ముక్కలు ముక్కలుగా ఖండిస్తున్న కాలం
ఇవాళ ఆనంద్ తెల్తుంబ్డే, గౌతమ్ నవ్లఖా

రేపు నువ్వు, నీ చెల్లి, అక్క అమ్మ, నాన్నా....
నువ్వు ఎవరైతేనేమి వారు పాడింది పదాలి
వారు ఆడమంటే ఆడాలి
తేడా వచ్చిందో నువ్వు రాజ్య ద్రోహివి
సాక్ష్యాలులను రాజ్యం కంటుంది వందలు వేలు
సమస్త అంగాలు వాటిని పెంచి పోషిస్తాయి
బహుకాయుడై అవి నిన్ను కంబలిస్తాయి

చూస్తూనే వుంటావా ఇలానే
రా కొద్దిగా చెయ్యి అందించు
నువ్వు నీ పక్కన వాడి చెయ్యి అందుకో
వాడిని అవతలి వాడి చెయ్యి అందుకోమను
మన దేముళ్ళ గొప్పలు తరువాత తేల్చుకుందాం
ఎవరి పూలూ కాయలైయ్యాయో తరువాత లెక్కేద్దాం
ఎవరి నడక సొగసుగా వుందో తరువాత పోటీ పడదాం

వాడు వస్తున్నాడు,
దా చెయ్యి కలుపు
ఇలాంటి వాళ్ళను చా మందిని చూసాం గా
మనం చెయ్యి కలిపితే వాడెంత
వస్తున్నావుగా మరి

# ఉద్యమాల బాటలో

## సేవా కార్యక్రమాలు

కరోనా లాక్‌డౌన్ కారణంగా ఇబ్బంది పడుతున్న ప్రజలకు రాష్ట్ర వ్యాపితంగా వివిధ రూపాల్లో ఐద్వా కార్యకర్తలు విస్తృతంగా సహాయ కార్యక్రమాలు చేపట్టారు.

**విజయవాడ :** ఐబిఎం శానిటేషన్ వర్కర్స్, ఐద్వా ఆధ్వర్యంలో రామసీత, పార్వతి, బేబి మజ్జిగ పంపిణీ చేశారు.

58వ డివిజన్‌లో ఎల్ ఐ సి మహిళా యంప్లాయిస్ సహకారంతో ఐద్వా ఆధ్వర్యంలో ఆషా వర్కలకు 100 మందికి కూరగాయల పంపిణీ చేశారు. అలాగే 58వ, డివిజన్ వడ్డెర కాలనీలో ఐద్వా సెంట్రల్ సిటీ కమిటీ ఆధ్వర్యంలో 250 మంది పిల్లలకు హార్లిక్స్‌తో పాలు, బిస్కెట్ ప్యాకెట్లు పంపిణీ చేశారు. ఈ కార్యక్రమంలో ఐద్వా రాష్ట్ర కార్యదర్శి డి.రమాదేవి, పశ్చిమ కృష్ణ కార్యదర్శి శ్రీదేవి, సెంట్రల్ సిటీ కార్యదర్శి ఝాన్సీ, దేవికుమారి, శాంతి, విజయలక్ష్మి పాల్గొన్నారు.

విజయవాడ సింగ్ నగర్ లోని 8 డివిజన్స్‌లో సుమారు 20,000 మందికి సిపిఎం పార్టీ ఆధ్వర్యంలో భోజనాల పంపిణీ జరిగింది. దీనిలో ఐద్వా మహిళలు ముఖ్య భూమిక పోషించారు.

జగ్గయ్యపేట పట్టణంలో ప్రజాసంఘాల ఆధ్వర్యంలో 160 మున్సిపల్ కార్మికుల కుటుంబాలకు 5 రకాల కూరగాయలు, రైస్ ప్యాకెట్ అందజేశారు.


అనంతపురం

**అనంతపురం జిల్లా:** అనంతపురం పట్టణంలో వివిధ కాలనీలో ఐద్వా నాయకులు కూరగాయలు పంపిణీ చేశారు.

గుంతకల్ పట్టణంలో స్వప్న హాస్పిటల్ వద్ద ఉన్న పేదలకు ఐద్వా మహిళా సంఘం పట్టణ కార్యదర్శి బి.రంగమ్మ సహాయంతో డివైఎఫ్ఐ, ఐద్వా నాయకులు ఆరు రకాలు కాయగూరలు, బియ్యం, సరుకులు పంపిణీ చేశారు.

ఐద్వా సభ్యులు అనంతపురం శ్రీశ్రీ గర్ కాలనీ, గణేనాయక్ కాలనీలలో కోడి గుడ్డుల పంపిణీ చేశారు.

ఐద్వా, డివైఎఫ్ఐ నాయకులు ఫాగింగ్ చేస్తూ కరోనా పై అవగాహన


తూర్పు గోదావరి

కల్పించారు.

**తూర్పుగోదావరి జిల్లా :** కాకినాడ అంగన్‌వాడీ టీచర్ అయేషా బేగం ఒక నేల జీతాన్ని కరోనా సహాయ కార్యక్రమాలకు అందజేశారు.

పెద్దాపురం హైవేలో వలస కార్మికులకు ఐద్వా సభ్యులు ఆహారం పొట్లాలు పంపిణీ చేశారు.


పశ్చిమ గోదావరి

**పశ్చిమ గోదావరి జిల్లా** ఆకివీడులో ఐద్వా కార్యకర్తలు పారిశుధ్య పరిరక్షణకు బ్లీచింగ్ చల్లారు.

**కర్నూలు జిల్లా :** కర్నూల్ నగర ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో 19వ వార్డులోని సోమిశెట్టి నగర్‌లో ఐద్వా మహిళలు ఉపాధి కోల్పోయిన కూలీలకు, కార్మికులకు స్థానికంగా ఉన్న మధ్య తరగతి కుటుంబాల దాతల సహకారంతో 40 పేద కుటుంబల వారికి 3 కేజీల సన్న బియ్యం, 1కేజీ కంది పప్పు, 100 మాస్కులు న్యూ సిటీ ఐద్వా అధ్యక్షురాలు సి. ప్రమీలమ్మ స్థానిక మహిళలు టి. గౌతమి, ఓ.వరలక్ష్మి, సి.రామ, యం.లలితమ్మ, యం. లక్ష్మీదేవి పంపిణీ చేశారు.

**ప్రకాశం జిల్లా :** ఒంగోలులోని ఎన్టీఆర్ కాలనీలో ఐద్వా ఆధ్వర్యంలో కూరగాయలు, అరటిపండ్లు, 100, మందికి పంపిణీ కార్యక్రమం నిర్వహించారు.

**గుంటూరు జిల్లా :** చెరుకుపల్లి మండలం కావూరు కాలువ కట్టపై ఉన్న 17 కుటుంబాల వారికి చెరుకుపల్లి ఉపాధ్యాయ సంఘం సహాయంతో ఐద్వా, సిఐటియు నాయకులు నిత్యావసర వస్తువులు పంపిణీ చేశారు.

**విశాఖ :** కరోనా నేపథ్యంలో ఐద్వా, ఎంవిఆర్ హాస్పటల్

సంయుక్తంగా వలస కార్మికు లకు నిత్యావసర సరుకులు 20 కేజీల బియ్యం, 10 కేజీల గోదమపిండి, వంటనూనె రెండు లీటర్లు, రెండు కేజీల కంది పప్పు, బంగాళదుంపలు, ఉల్లిపాయలు, టమాటో, కారెట్, బీట్‌రూట్, కోడి గుడ్లు, మిరపకాయలు, కారంబూంది అందజేశారు.

విశాఖ సిటీ 69వ వార్డు షీలానగర్‌లో ఆటో కార్మికులకు ఐద్వా, సిఐటియు ఆధ్వర్యంలో భోజన పంపిణీ నిర్వహించారు.

**తిరుపతి :** ఐద్వా నాయకులు పేదలకు భోజనం అందించారు.

ఐద్వా ఆధ్వర్యంలో తారక రామానగర్‌లో బాలింతలకు చిన్న పిల్లలకు భోజనాలు పంపిణీ జరిగింది.


నెల్లూరు

**నెల్లూరు :** నెల్లూరు గిరిజన కార్మికులకు ఐద్వా, జెవివి వారి సౌజన్యంతో ఆహారం పంపిణీ చేశారు.

నెల్లూరు రూరల్ 31 వడివిజన్ వై ఎస్ ఆర్ నగర్ నందు శ్రీ విద్య స్వయం సహాయక సంఘం మహిళ ల సౌ జన్యంతో 250 కుటుంబాల వారికి భోజనం వండి వడ్డించారు. 3 వ డివిజన్ పరిధిలోని సుబహన్ నగర్‌లో దాత ఖాజ మస్తాన్ గారి ద్వారా 300 గిరిజన కుటుంబాలకు భోజనం ఏర్పాటు చేయటమైంది..

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ 1,2,32వ డివిజన్లలో నవలాకుల తోట, అంబాపురం గిరిజన కాలనీలో "ఐద్వా" మహిళా సంఘం ఆధ్వర్యంలో ఎస్ కే బాబు, ఎస్ కే ఖాజామస్తాన్ సౌజన్యంతో 700మందికి భోజనాలు అందించారు.

నెల్లూరు జిల్లా 15వ, డివిజన్ బాలజినగర్‌లో ఐద్వా ఆధ్వర్యంలో ఐద్వా నగర నాయకులు ఎన్.వి.సుబ్బమ్మ, రెహానుమా, కుమారమ్మ, నిత్యావసర సరుకుల పంపిణీ చేశారు.

24వ డివిజన్ సుందరయ్యానగర్ ఎ బి ఇ బ్లాకులో 700 కుటుంబాలకు ఏడు రకాల కూరగాయలను అందించారు.

నెల్లూరు రూరల్ పరిధి 25,26,21,22,డివిజన్ లపరిధిలలో సుందరయ్యానగర్ సి,డి బ్లాక్, బుజబుజ నెల్లూరు ,ఉమ్మారెడ్డి గుంట, ప్రాంతాలనందు భవన నిర్మాణ కార్మికులకు, పేదలకు ఐద్వా, డివైఎఫ్ఐ, సిపిఎం పార్టీ ఆధ్వర్యంలో నిత్యావసర సరుకులు కూరగాయలు, భోజనం, అంబలిని అందించారు.

బలిజిపేట మండలం నారాయణపురం సువర్ణముఖి నదిపై బిడ్జి పనులు చేయడానికి వచ్చిన బెంగాల్ వలస కార్మికులకు యాభై కేజీల బియ్యం, కూరగాయలు, నిత్యావసర వస్తువులు పంపిణీ చేశారు.

**విజయనగరం :** పార్వతీపురం జిల్లా బొబ్బిలి మున్సిపాలిటీలో పని చేస్తున్న పారిశుధ్య కార్మికులకు ఐద్వా కార్యకర్తలు మజ్జిగ ప్యాకెట్లు పంపిణీ చేశారు.

**శానిటైజర్, మాస్కులు పంపిణీ**

**రాజమండ్రి :** రాజమహేంద్రవరంలో బాలాజీ దాస్ విజ్ఞాన కేంద్రం (బివికె) ట్రస్ట్, ప్రజాసంఘాలు ఆధ్వర్యంలో ఆశా కార్మికులకు శానిటేజర్, మాస్కులు పంపిణీ చేశారు. అర్బన్, రూరల్, కడియం, కేశవరంలో మొత్తం 300 మందికి, ప్రజాశక్తి సిబ్బంది 30 మందికి పంపిణీ జరిగింది. ఈ కార్యక్రమంలో సిపిఎం జిల్లా కార్యదర్శి టి అరుణ్, సిఐటియు జిల్లా ప్రధాన కార్యదర్శి ఎస్ఎస్ మూర్తి, స్వామి యాడ్స్ ఎండి జి భాస్కర్, ఆయన సతీమణి కృష్ణకుమారి, ఐద్వా, డివైఎఫ్ జిల్లా కార్యదర్శులు పి. తులసి, బి రాజులోవ, యూటీఎఫ్ నాయకులు ఎ.షరీఫ్, సిఐటియు నాయకులు బి పూర్ణిమారాజు, సాయిబాబు, మాచారావు, వెంకటలక్ష్మి తదితరులు పాల్గొన్నారు.

**విజయవాడ :** రోటరీ మిడ్ టౌన్, ఐద్వా ఆధ్వర్యంలో 62వ, డివిజన్‌లో 90 మంది శానిటరీ వర్కర్స్‌కు మాస్కులు, శానిటైజర్ బాటిల్స్ పంపిణీ చేశారు.

**కాకినాడ :** గొల్లపాలెంలో అంగన్వాడీలు పంచాయితీ, బిల్డింగ్ వర్కర్స్‌కి బియ్యం, కూరగాయలు, సోప్స్, సానీటైజర్స్, మాస్కులు ఇచ్చారు. అలాగే తాళ్లరేవు ప్రాజెక్టు గొల్లపాలెం సెక్టార్ సచివాలయ సిబందికి, పోలీసులకు మాస్కులు, సోప్స్, సానిటైజర్స్, బిస్కెట్ పేకట్స్ అందజేశారు.


కాకినాడ

కాకినాడ మట్లపాలెంలో మస్కులు పంపిణీ చేశారు.

**పశ్చిమ గోదావరి :** ఆకివీడు పట్టణ కమిటీ ఆధ్వర్యంలో వైద్య సిబ్బందికి, కార్మికులకు మాస్కులు పంపిణీ చేశారు.

**తూర్పు గోదావరి :** అమలాపురం కమిటీ ఆధ్వర్యంలో మునిసిపల్ పారిశుధ్య కార్మికులకు మాస్కులను అందజేశారు. ఈ కార్యక్రమంలో లయన్స్ క్లబ్ ప్రెసిడెంట్ పూర్ణిమ, లీగల్ సెల్ ప్రెసిడెంట్ శిరోమణి, ఐద్వా డివిజన్ కార్యదర్శి నాగవరలక్ష్మి, ఐద్వా అమలాపురం పట్టణ సభ్యులు డి సువర్ణ, సిహెచ్ దేవి, సిఐటియు నాయకులు గోపి తదితరులు పాల్గొన్నారు.

**ట్రాన్స్‌జెండర్స్‌కు తోడ్పాటు**

బొబ్బిలి మండలంలో ట్రాన్స్‌జెండర్లకు రేషన్ కార్డులు ఇవ్వాలని, ప్రభుత్వాలు సహాయం చేయాలని ఐద్వా, సిఐటియు వ్యవసాయ కార్మిక సంఘం తాసిల్దార్‌కు వినతి పత్రం అందజేశారు.

గుంటూరు రూరల్ పరిధిలో ఉన్న నాయుడు పేటలో 25 హిజ్రా కుటుంబాలకు బియ్యం, కూరగాయలు పంపిణీ చేశారు. కాకినాడ అంబేద్క ర్ భవనం నందు ట్రాన్స్‌జండర్స్‌కి 60 కేజీల బియ్యం, నిత్యావసర కిట్లను అందజేశారు.

అమలాపురం ఐద్వా కార్యకర్తలు కూరగాయలు పంపిణీ చేశారు. కాకినాడలో దాతల సహకారంతో ట్రాన్స్‌జండర్స్‌కి రూ. 8 వెలు విలువ చేసే నిత్యవసర సరుకులు అందించారు.

**మేము సైతం అంటున్న ట్రాన్స్ జెండర్స్**

విజయవాడ అజిత్ సింగ్ నగర్, సత్యానారాయణపురం, ఏలూరు లాకులు ప్రాంతాల్లో ప్రజలకి, పోలీసులకు శాని టైజర్లు, మాస్కులు అందించడంలో న్యూరాజ రాజేశ్వరి పేటకు చెందిన ట్రాన్స్ జెండర్స్ ముందుకొచ్చారు. రోడ్లపై రాకపోకలు సాగించే వారికి జాగ్రత్తలు చెప్పారు.

## నివాళులు

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ 129వ జయంతి సందర్భంగా అమలాపురం పూలమాల వేసి నివాళులర్పించారు.


అమలాపురం

పార్వతిపురం : మహోన్నతమైన మహిళా ఉద్యమ నేత స్వాతంత్ర సమరయోధురాలు విమలారణదివెగారికి బొబ్బిలి ఐద్వా కమిటీ అరుణాంజలి ఘటించారు.

బొబ్బిలి చీపురుపల్లి వీధిలో ఐద్వా నాయకులు కందుకూరి వీరేశలింగంగారి 101వ వర్ధంతి జరిపారు.

అనంతరపురంలో విరేశలింగం వర్థంతి సభ ఆన్‌లైన్‌లో జరిగింది. 1200 మంది పాల్గొన్నారు. సింగనేని నారాయణ, కిన్నెర శ్రీదేవి ప్రసంగించారు. ఐద్వా ఇతర సంఘాలతో కలిసి రాష్ట్ర కేంద్రం నుండి నిర్వహించిన ఫేస్‌బుక్‌లైవ్‌లో ఆశాజ్యోతి ప్రసంగించగా ఏడువందల మంది చూశారు.

**నెల్లూరు :** నెల్లూరు రూరల్ 24 వ డివిజన్ సుందరయ్యనగర్ ఎ బ్లాక్ స్థానిక ఐద్వాకమిటి ఆధ్వర్యంలో రాజ్యాంగ నిర్మాత డా ,, బాబా సాహెబ్ అంబేద్కర్ జయంతి సందర్భంగా ప్రతిజ్ఞ చేసి, నివాళులర్పించారు.

రామభద్రపురంలో భగత్ సింగ్ వర్ధంతి నిర్వహించారు. ఈ సందర్భంగా ఇందిర మాట్లాడుతూ కరోనా పైన దేశభక్తి యుతి పోరాటం చేయాలని కోరారు.

మోటూరు ఉదయం గారి వర్దంతి సందర్భంగా విజయవాడ వాంబే కాలనీ వృద్దాశ్రమంలో 70 మంది వృద్ధులకు ఐద్వా డివిజన్ కమిటీ


విజయవాడ

ఆధ్వర్యంలో ఫూట్స్ పంపిణీ జరిగింది.

ఓల్డ్ సిటీ లోని జోహరపురంలో, ఒంగోలులో మహిళా ఉద్యమ నిర్మాత మోటూరు ఉదయం గారి వర్ధంతి సభ జరిగింది. ఈ సందర్భంగా ఐద్వా ఓల్డ్ సిటీ కార్యదర్శి పద్మ మాట్లాడుతూ మోటూరి ఉదయం గారు డాక్టర్‌గా ప్రజలకు ఎన్నో సేవలు అందించారు. అలాగే మహిళల సమస్యల కోసం ఎన్నో పోరాటాలు చేశారు. ఆమె అడుగు జాడలలో నడవాలని పిలుపునిచ్చారు. ఈ కార్యక్రమంలో మహిళా సంఘం టౌన్ నాయకులు క్రమున్ భీ, వేణి,అమీనా, బ్రసున్ తదితరులు పాల్గొన్నారు.

నెల్లూరు రూరల్ 24 ,25 డివిజన్లు సుందరయ్యనగర్ బైపాస్


నెల్లూరు

సెంటర్ నందు ఐద్వా మహిళా కమిటీ సభ్యులతో సుందరయ్యగారికి నివాళులర్పించారు.

సుందరయ్య గారి వర్ధంతి సందర్భంగా తూర్పుగోదావరి జిల్లా అమలాపురం బండారులంక గంగలకుర్రు అగ్రహారంలో 300 మంది ఉపాధికూలీలకు మజ్జిగ అందజేశారు.

# బిపిఎల్ కుటుంబాలన్నింటికీ ఉచితంగా మూడు సిలెండర్లు ఇవ్వాలని కోరుతూ


గుంటూరు

**గుంటూరు :** లాక్‌డౌన్‌లో పేద కుటుంబాలకు మూడు గ్యాస్ సిలెండర్లు ఇవ్వాలని తూర్పుగుంటూరులో ఐద్వా నాయకులు నిరసన జరిపారు.

**విజయవాడలో...** ఐద్వా, సిఐటియు ఆధ్వర్యంలో 63వ, 58వ, 1వ డివిజన్‌లో ఐద్వా కమిటీ ఆధ్వర్యంలో తెల్ల రేషన్ కార్డు దారులందరికి మూడు నెలలపాటు గ్యాస్ సిలిండర్ ఉచితంగా ఇవ్వాలని ఐద్వా సెంట్రల్ సిటీ కార్యదర్శి జి.ఝాన్సీ రాణి, డివిజన్ కార్యదర్శి బి.అమ్ములు, అంజమ్మ, దుర్గ తదితరులు నిరసన కార్యక్రమం జరిపారు. ఈ కార్యక్రమంలో ఐద్వా రాష్ట్ర కార్యదర్శి రమాదేవి పాల్గొని మాట్లాడుతూ తెల్ల రేషన్ కార్డుదారులందరికి ఉచితంగా 3 గ్యాస్ సిలిండర్‌లు ఇవ్వాలని, జన్ ధన్ ఖాతాలో 7500 రూ. ప్రతి కుటుంబానికి వేయాలని, మద్యం దురలవాటు వల్ల అనారోగ్యానికి గురయిన వారికి వైద్యం చేయించాలని, వలస కార్మికులను వారి స్వగ్రామాలకు పంపాలని డిమాండ్ చేశారు. మద్య నియంత్రణ చేయాలని ప్రభుత్వాన్ని ఐద్వా, సిఐటియు నాయకులు కోరారు. అనంతరం ఎల్ఐసి కాలనీలో మున్సిపల్ వర్కర్స్‌తో కలిసి లాక్ డౌన్ తర్వాత ప్రభుత్వం మద్యం షాపుల మూసీ వేత కొనసాగించాలని, ప్రజల ఆరోగ్యాన్ని పరిరక్షించాలని డిమాండ్ చేశారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర ఉపాధ్యక్షులు శ్రీదేవి, మున్సిపల్ వర్కర్స్ యూనియన్ నాయకులు డేవిడ్ పాల్గొన్నారు.

విజయవాడ : 64వ, డివిజన్‌లో డ్వాక్రా గ్రూపుల వారికి 3 నెలలు లోనూ, పొదుపు కట్టకుండా మినహాయింపు ఇవ్వాలని, అలాగే వడ్డీలు వేయరాదని ఐద్వా కార్యకర్తలు సచివాలయ అధికారులకు మెమొరాండం అందజేశారు.

కంకిపాడు మండలం ఐద్వా నాయకురాలు బి.కీర్తి ఇంటి దగ్గర నిరసన కార్యక్రమం చేపట్టారు.

డ్వాక్రా గ్రూపులు, ప్రైవేటు, మైక్రో ఫైనాన్స్, సంస్థలు రుణాలు కోసం ప్రజలను ఒత్తిడి నిలుపుదల చేయాలిని, వడ్డి ప్రభుత్వం ఇవ్వాలన్నారు. మున్సిపల్, పంచాయితీ, ఆశ కార్మికులకు మాస్కులు, గ్లౌవ్స్‌లు, శానిటరీ,నిత్యావసర వస్తువులు ఇవ్వాలని కోరారు. రాష్ట్రంలో ఐదువేల మంది మంత్రికి అధికారులకు ఫోన్ మెసెజ్‌లు పెట్టారు. ఫలితంగా 14 వందల కోట్లు జీరో వడ్డీ కింద ప్రభుత్వం విడుదల చేసింది. రుణకిస్తీలు వసూలు చేయవద్దని అధికారులకు ఆదేశాలు జారీ చేశారు.

**పార్వతిపురం :** ఇందిరమ్మ కాలనీ సచివాలయం అధికారిణి రూపా దేవికి ఐద్వా జిల్లా నాయకులు ఇందిరా, ఇతర


పార్వతిపురం

నాయకులు, కాలనీవాసులు వినతి పత్రం అందజేశారు. కాలనీలో గల యానాదులు (నక్కల) కుటుంబీకులు 20మందికి రేషన్ కార్డులు లేవు. వీరు పని లేక ప్రతి పూట పస్తులు ఉంటున్నారు. కాలనీలో రేషన్ కార్డు లేని వారికి అందరికీ రేషన్ అందించాలని కరోనా వ్యాధితో పని లేని వారిని కాపాడాలని ఇందిరా, అశ్విని, రాము, శాంతమ్మ, సంగమేశ్, రాధా తదితరులు కోరారు.

**పశ్చిమ గోదావరి జిల్లా :** నరసాపురంలో కేంద్ర ప్రభుత్వం ఉచితంగా ఇస్తానన్న మూడు గ్యాస్ సిలిండర్లను తెల్ల రేషన్ కార్డు ఉన్న వారందరికీ వెంటనే ఇవ్వాలని కోరుతూ ఐద్వా ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమాన్ని నిర్వహించారు.

తణుకు ఐద్వా ఆధ్వర్యంలో వలస కార్మికులను ఇళ్ళకు చేర్చాలని, కార్డులేని వారందరికి రేషన్ ఇవ్వాలని, మూడు గ్యాస్ సిలిండర్‌లు ఉచితంగా ఇవ్వాలని ప్రభుత్వాన్ని కోరారు.

**తూర్పుగోదావరి జిల్లా :** కాకినాడ, అమలాపురం ఈదరపల్లిలో ఐద్వా ఆధ్వర్యంలో మూడు గ్యాస్ సిలిండర్లు తెల్లరేషన్ కార్డుదారులందరికి ఉచితంగా ఇవ్వాలని నిరసన కార్యక్రమం నిర్వహించారు.

అమలాపురం ఈదరపల్లిలో ఐద్వా కమిటీ కరోనా కారణంగా పెరిగిన కూరగాయల ధరలు, మహిళలు ఇబ్బందులను అడిగి

తెలుసుకున్నారు.

ఐద్వా ఆధ్వర్యంలో ఉజ్వల పథకం ద్వారా గ్యాస్ సిలెండర్లు



ఏటపాక

ఇవ్వాలని ఏటపాకలో మహిళలు వినూత్న నిరసన చేశారు.

**గుంటూరు జిల్లా :** వినుకొండలో ఉచితంగా మూడు గ్యాస్ సిలిండర్లు ఇవ్వాలని, పని చూపించాలని కోరారు.

**నెల్లూరు :** నెల్లూరు రూరల్ 33 వడివిజన్ వెంగళరావు నగర్‌లో ఉచితంగా మూడు గ్యాస్ సిలండర్లు ఇవ్వాలని డిమాండ్ చేశారు. నెల్లూరు రూరల్ 24, వ డివిజన్ సుందరయ్యనగర్ ఎ బి , ఇ బ్లాక్ లలో పెంచిన విద్యుత్ చార్జీలను వెంటనే తగ్గించాలని కోరుతూ జరిగిన నిరసనలో పాల్గొన్నారు.

**విజయనగరం :** బొబ్బిలిలో డ్వాక్రా రుణాలు వాయిదా వేయాలని వడ్డీ రద్దు చేయాలని అధికారులకు ఐద్వా కార్యకర్తలు వినతి పత్రం అందజేశారు.



బొబ్బిలి

బొబ్బిలిలో 13వ వార్డు ఇందిరమ్మ కాలనీలో మహిళలు అందరికీ గ్యాస్ అందడం లేదని ఉజ్వల పథకం ఉన్నవారికే ఇస్తున్నారని రేషన్ కార్డ్ ఉన్న అందరికీ ఉచిత గ్యాస్ ఇవ్వాలని ఐద్వా పొదుపు సంఘాల నాయకులు నిరసన తెలియజేశారు.

బొబ్బిలి మండలం ఎం బూర్జి వలస గ్రామంలో ఐద్వా వ్యవసాయ కార్మిక సంఘం కమిటీల ఆధ్వర్యంలో సిలిండర్లతో నిరసన కార్యక్రమం చేశారు.

బొబ్బిలిలో 23వ వార్డు మల్లం పేటలో పెంచిన విద్యుత్ ఛార్జీలు తగ్గించాలని ఐద్వా ప్రజా సంఘాలు నిరసన కార్యక్రమం చేపట్టారు.

**ప్రకాశం :** కరోనా కారణంగా ఉపాధికోల్పోయిన పేదలకు కేంద్రప్రభుత్వం ఉచితంగా మూడు గ్యాస్ సిలిండర్లు ఇవ్వాలని ఐద్వా ఆధ్వర్యంలో ఒంగోలులోని జాషువా కాలనీలో నిరసన కార్యక్రమం జరిపారు.

**చిత్తూరు :** తిరుపతిలో పెంచిన కరెంట్ ఛార్జీలకు వ్యతిరేకంగా నిరసన కార్యక్రమం ఇతర సంఘాలతో కలసి నిర్వహించారు.

మదనపల్లిలో కరెంట్ బిల్లు రద్దు చేయాలని కోరుతూ నిరసన కార్యక్రమం నిర్వహించారు.

**మద్యం షాపులు మూసివేయాలని :** నంద్యాలపట్నంలోని విశ్వనగర్‌లో, 23వ వార్డు నందు, ఆత్మకూరులో మూడు చోట్ల బనగానపల్లెలో ఒక చోట, బండి ఆత్మకూర్ మండలంలోని



నంద్యాల

మూడు గ్రామలలో మద్యంపై ఐద్వా డివైఎఫ్, ఐసిఐటియు ఆధ్వర్యంలో నిరసనకార్యక్రమాలు జరిగాయి.

మద్యం వద్దండి.. తిండి పెట్టండి అని మహిళలు ప్లకార్డులతో నిరసన తెలిపారు.

**విజయవాడ :** 64వ, 60వ, 63వ, 59వ, 61వ డివిజన్లలో తెరిచిన మద్యం షాపులు వెంటనే మూసివేయాలని జరిగిన నిరసన కార్యక్రమంలో ఐద్వా సెంట్రల్ సిటీ కార్యదర్శి జి.ఝాన్సీ, డివిజన్ అధ్యక్షురాలు జి.లత, సావిత్రి, లక్ష్మీ పాల్గొన్నారు.

ప్రతింటికి నిత్యావసర సరుకులు పంపిణీ చేయాలని డిమాండ్



విజయవాడ

చేస్తూ సిపిఎం, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో తిరువూరు సుందరయ్య కాలనీలో మహిళలు, ప్రజాసంఘాల నాయకులు నిరసన తెలిపారు.

నూజివీడు లో ఐద్వా, సిఐటియు ఆధ్వర్యంలో చిన్న గాంధీ బొమ్మ సెంటర్లో చౌకధరల దుకాణాల ద్వారా పదహారు రకాల నిత్యావసర సరుకులు అందించాలని ఆందోళన చేశారు.

విజయవాడ పశ్చిమ నగర కమిటీ ప్రజల ఆరోగ్యాన్ని ఫణంగా పెట్టడాన్ని నిరసిస్తూ, ప్రభుత్వం తక్షణం మద్యం షాపులను మూసివేయాలని డిమాండ్ చేశారు. 51వ డివిజన్ కార్యదర్శి


నూజివీడు

వెంకటరత్నం, 44వ డివిజన్ నగర కమిటీ ఉపాధ్యక్షులు కె.శేషమణి, కార్యదర్శి విక్రం లక్ష్మీ, 43 వ డివిజన్ నగర ఆఫీస్ బరర్ ఎస్.కె.ఫారీదా, 48 వడివిజన్ డివిజన్ కార్యదర్శి రాజేశ్వరి, కనకలక్ష్మి, పాలవల్లి ఆధ్వర్యంలో నాలుగు ప్రాంతాల్లో ఆందోళన చేశారు.

మద్యం దుకాణాలు తెరవొద్దు – కరోనాను పెంచ వద్దు అంటూ కృష్ణా జిల్లా మొవ్వ మండలం ఎంఆర్ఓ కార్యాలయం వద్ద ప్లకార్డులు ప్రదర్శించారు.

జుజ్జూరులో మద్యం షాపులు మూసివేయాలని నిరసన జరిపారు.

**గుంటూరు జిల్లా :** పాత గుంటూరు శ్రామికనగర్‌లో, తాడేపల్లి రామయ్య కాలనీలో, పిడుగురాళ్లలో, సత్తెనపల్లి పట్టణంలో, ముప్పాళ్ళ మండలం మాదల గ్రామంలో ఐద్వా ఆధ్వర్యంలో


తాడేపల్లి

తెరిచిన బ్రాంది షాపులను వెంటనే మూసివేయాలని మద్య నియంత్రణ చేయాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేస్తూ నిరసన కార్యక్రమం చేశారు.

**ప్రకాశం జిల్లా :**

మద్యం షాపులు తీయొద్దు కరోనాని పెంచొద్దు మద్యం వద్దు తిండి కావాలి అని, మద్యం ఉత్పత్తులుకు అమ్మకాలకు అనుమతి ఇవ్వడాన్ని విరమించుకోవాలని ఐద్వా, సిఐటియు ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమం ఒంగోలులో జరిగింది.

**నెల్లూరు :** రూరల్ 24 డివిజన్ కనుపర్తి పాడు, 3వ డివిజన్ సుభహన్ నగర్ సెంటర్, 24వ డివిజన్ సుందరయ్యనగర్ 25వ డివిజన్ బృందావనకాలనీలో, 39 వ డివిజన్ తాంబరం వారి వీధి లో, 3 వ డివిజన్ సుభహన్ నగర్‌లో, 21 ,22 ,డివిజన్లు పరిధి మా గుంట లే అవు ట్, శ్రామిక నగర్, వైఎస్సార్ నగర్, చవటమిట్టలలో ఐద్వా, డి వై ఎఫ్ ఐ ఆధ్వర్యంలో నిరసన చేశారు. మద్యం షాపులు వద్దంటూ కంచాల శబ్దం చేస్తూ ముఖ్యమంత్రి గారు మహిళలకు ఇచ్చిన మద్య నిషేధ హామీని వెంటనే అమలు పరచాలని నిరసన తెలిపారు.

నెల్లూరు జిల్లా మర్రి పాడు ఇసుక పల్లి గ్రామం, టౌన్ పరిధిలో బాలు పల్లి, బిసి కాలనీలలో ర్యాలీ నిరసన కార్యక్రమాలు నిర్వహించారు.

ప్రభుత్వం వాగ్దానం చేసిన విధంగా మద్య నిషేధం అమలు చేయాలని కోరుతూ ఐద్వా మహిళా సంఘం ఆధ్వర్యంలో ముప్పై వ డివిజన్లోని మాలకొండారెడ్డి నగర్లో మహిళలు నిరసన తెలిపారు.

**తూర్పుగోదావరి జిల్లా :** మద్యం షాపులు తెరవడానికి వ్యతిరేకంగా ఐద్వా ఆధ్వర్యంలో పెద్దాపురం మెయిన్‌రోడ్‌లో ధర్నా నిర్వహించారు. పోలీసులు జోక్యం చేసుకొని రెడ్ జోన్ లో ఉన్న షాపును మూయించేసారు..

సామర్లకోటలో అమ్మానమ్మ కాలనీ, గాంధీ నగర్, సాయి నగర్ ప్రాంతాలలో కార్యక్రమాలు చేశారు. గాంధీకి వినతి పత్రం ఇచ్చారు.


తూర్పు గోదావరి

అమలాపురం ఏరియాలోని అంబాజిపేట మండలంలో నిరసన చేపట్టారు. వేమవరం, అయినవిల్లి మండంలో, తాళ్లరేవు మండలం నీల పల్లిలో నిరసన తెలిపారు. అమలాపురం ప్రాంతంలో మూడు మండలాలు 19. ప్రాంతాల్లో 12 వార్డుల్లో 1630 మంది నిరసన తెలియజేశారు... మొత్తం జిల్లాలో 92 ప్రాంతాల్లో 3185 మంది పాల్గొన్నారు.

కాకినాడ పాతబస్టాండ్, ఇంద్రపాలెం, సంజయ్ నగర్, చీడిగ


అయినవిల్లి

పలు ప్రాంతాల్లో మహిళలు కంచాలు మోగిస్తూ నిరసన తెలిపారు.

రాజమహేంద్రవరం నగర పరిధిలో నందంగని రాజు సెంటర్, లాలచెర్వు, ధవళేశ్వరం, కడియం 4 కేంద్రాల్లో ఐద్వా, శ్రామిక మహిళ, ప్రజాసంఘాల ఆధ్వర్యంలో మద్యంపై నిరసన కార్యక్రమాలు జరిగాయి. కడియంలో పోలీస్‌లు అరెస్టులు చేశారు.

**పశ్చిమ గోదావరి జిల్లా :** తణుకులో ఇళ్ల మధ్య మద్యం షాపు తీసి వేయ్యా లని ఎక్సైజ్ సిఐగారికి రిప్రజంటేషన్ ఇచ్చారు.

మద్యం షాపులు తెరిచి ప్రజల ఆరోగ్యాన్ని ఫణంగా పెట్టడాన్ని నిరసిస్తూ ఐద్వా ఆధ్వర్యంలో ఆకివీడు, ఎలమంచిలి,



నరసాపురం, చించినాడ, పాలకొల్లు, తణుకు ప్రాంతాల్లో ఐద్వా ఆధ్వర్యంలో నిరసన కార్యక్రమాలు చేశారు.

తణుకు 7వార్డు అజ్జరం కొలనీలో మద్యం షాపులుతీసి వేయాలి తిండికావాలి ఉపాధి పనులు కావాలి ఆర్థికంగా ఆదుకోవాలని మహిళలు నిరసనలు చేశారు.

నరసాపురం ఐద్వా ఆధ్వర్యంలో మద్యంషాపు కరోనా కారణంగా మూసివేయ్యాలని కోరుతూ నిరసన తెలిపారు.

**కర్నూలు జిల్లా :** కర్నూలు నగరంలోని సుందరయ్య జంక్షన్లో సిఐటియు జిల్లా అధ్యక్షులు పి ఎస్ రాధాకృష్ణ అధ్యక్షతన మద్యం షాపులు మూసివేసి ఐద్వా, సిఐటీయు, డివైఎఫ్ఐ, జెవివి, పిఎన్ఎం డిమాండ్ చేశారు.

మద్యం షాపులను మూసివేయాలని కరోనా భారి నుండి ప్రజలను కాపాడాలని కరోనా వల్ల ఉపాధి కోల్పోయిన ప్రతి పేద కుటుంబానికి నెలకు రూ. 10000 ఇవ్వాలని, రేషన్ షాపులలో


తూర్పు గోదావరి

16 రకాల నిత్య అవసర వస్తువులను ప్రతి పేద కుటుంబానికి ఇవ్వాలని ఉపాధి చూపించాలని ,విద్య, వైద్యం అందించాలని ఐద్వా ,పొదుపు సంఘాల ఆధ్వర్యంలో కర్నూలలోని నేతాజీ హౌసింగ్ కాలనీలో 35 మంది, పచ్చబీల్డింగుల ప్రాంతంలో 15 మంది తో, ఎన్ టి ఆర్ నగర్‌లో 10 మంది తో ప్ల కార్డ్స్ పట్టుకుని నిరసన చేశారు.

ఉలిందకొండ గ్రామంలో వైన్ షాప్‌ను మూసేవరకు బైఠాయించి డ్వాక్రా మహిళలు బందు చేశారు.

బుధవారంపేటలో ఏడు చోట్ల వంద మందికి పైగా మహిళలతో మద్యంపై నిరసన కార్యక్రమం జరిగింది.

**విశాఖపట్నం :** మధురవాడ జోన్ ఐద్వా ఆధ్వర్యంలో మద్యం దుకాణాలు పై నిరసన కార్యక్రమం జరిగింది..

అనకాపల్లిలో మద్యం అమ్మకాలకు వ్యతిరేకంగా మహిళలు ఆందోళన చేపట్టారు.

విశాఖ సిటీ 69వ వార్డు శీలానగర్‌లో నిరసన జరిపారు.

నర్సీపట్నం పెదబొద్దెపల్లి లో నిరసన చేపట్టారు.

విశాఖ సిటీ గాజువాక జోన్‌లో పెందుర్తి జోన్ వార్డ నెం. 94 అప్పల నరసయ్య కాలనీలో మద్యం వద్దు తిండి కావాలి అని




నర్సీపట్నం

నిరసన చేశారు.

**విజయనగరం జిల్లాలో :** బొబ్బిలి మండలంలో రంగరాయ పురంలో నిరసన తెలియజేశారు,

పార్వతీపురం జిల్లా బొబ్బిలి బైపాస్ రోడ్‌లో ఉన్న షాపు మూసివేయాలని మహిళలు నిరసన కార్యక్రమం చేశారు.

పార్వతీపురం పట్టణం, వివేకానంద కాలనీలో మద్యం అమ్మకాలు


బొబ్బిలి

నిలిపివేయాలని నిరసన జరిగింది.

బొబ్బిలి ఎన్టీఆర్ బొమ్మ దగ్గర మద్యం షాపు వద్దని మద్య నిషేధం అమలు చేయాలని డిమాండ్ చేశారు.

బాడంగిలో దళిత కాలనీలో మహిళలు, కూలీలు కంచాలు, పాత్రలు, గరిటేలతో మద్యం వద్దు తిండి కావాలి, షాపు తీయ వద్దు కరోనా పెంచవద్దు అని నిరసన తెలిపారు.


విజయనగరం

విజయనగరంలో గజపతినగర్‌లో, ఆంధ్రలో, మరో ఆరు చోట్ల కలిపి మొత్తం8చోట్ల 180మందితో మద్యంపై వ్యతిరేకంగా మహిళలు నిరసన తెలిపారు.

సీతానగరం మండలం, వెంకటాపురం గ్రామంలో నిరసన


సీతానగరం

జరిగింది.

**అనంతపురం జిల్లా :**

అనంతపురం పట్టణంలో వైన్‌షాపు వద్ద ప్లకార్డ్స్‌తో ఐద్వా నాయకులు నిరసన తెలియజేశారు. మద్యంషాపులు తెరవొద్దు అన్నందుకు బుక్కరాయ సముద్రంలో ఐద్వా, డివైఎఫ్ఐ నాయకులను పోలీసులు అక్రమంగా అరెస్టులు చేశారు. మే 11వ తేదీన జిల్లాలో 48 చోట్ల 2400 మంది భారీగా నిరసనలో పాల్గొన్నారు.


మదనపల్లి

**చిత్తూరు జిల్లా :** మద్యం వద్దు, తిండి కావాలి అని తిరుపతి, మారుతీ నగర్. ఐద్వా నగర కమిటీ ఆధ్వర్యంలో ఐద్వా కమిటీ సభ్యులతో నిరసన తెలిపారు.

మద్యం షాపులను తక్షణమే మూసివేయాలని కెవిబిపురం మండల ఐద్వా కార్యదర్శి మల్లారపు వరలక్ష్మి డిమాండ్ చేశారు.

కొత్తూరు గ్రామంలో మహిళా సంఘం ఆధ్వర్యంలో మద్యం షాపులు తెరవడంపై నిరసన తెలియజేశారు.

మదనపల్లిలో ఐక్యవేదిక ఆధ్వర్యంలో మద్యం షాపులు మూసివేయాలని నిరసన కార్యక్రమం చేపట్టారు.

# మద్యం వద్దు - పని కావాలి



విజయనగరం



అనంతపురం




విశాఖ



పిడుగురాళ్ల



పార్వతీపురం



పశ్చిమ గోదావరి



ఏలూరు



రాజమండ్రి

R.NO.58/Sou/Advt.II/2019-20

CHAITANYA MANAVI Vol. : 2 ISSUE : 4 GUNTUR, APRIL, MAY, JUNE 2020 56 Pages Rs. 20/-



# జగనన్న చూపిన 'దిశ' ! మహిళల భద్రతలో మేలు దశ !!



శ్రీ వై.ఎస్. జగన్ మోహన్ రెడ్డి గారు
ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

## ఏ. పి. దిశ చట్టం - 2019






- 18 దిశ పోలీస్ స్టేషన్లు
- 13 ప్రత్యేక దిశ కోర్టులు
- 14 దిశ వన్ స్టాప్ సెంటర్లు
- దిశ ఫోరెన్సిక్ లాబ్స్
- దిశ కమాండ్ కంట్రోల్ రూమ్
- దిశ యాప్ ఏర్పాటు
- దిశ ప్రామాణిక ఆపరేటింగ్ విధానం
- 100 కోట్ల నిధులు కేటాయింపు

**మహిళాభివృద్ధి మరియు శిశు సంక్షేమ శాఖ**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం




hats off
CM
Sir

**Women Help Line**
**181/100**
**112/1098**

## చైతన్య మానవి

ఐద్వా రాష్ట్ర కార్యాలయం
31-5-6, ప్రకాశరావు వీధి, మారుతీ నగర్,
చుట్టుగుంట వద్ద, విజయవాడ - 4
ఆంధ్రప్రదేశ్.
ఫోన్ : 94900 98620

బుక్‌పోస్ట్

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | CMV01A 192 |
| పుస్తకం పేరు | చైతన్య స్రవంతి |
| తారీఖు | 31/8/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 52 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | sandhya |
| పేజీలు విడదీసినది | sandhya |
| స్కాన్ చేసినది | pragathi |
| పరీక్ష చేసినది | MOUNIKA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |